# గృహలక్ష్మి

స్త్రీల ఆరోగ్యసౌభాగ్యములను
పెంపొందించుట కేర్పడిన
సచిత్ర మాస పత్రిక

సంపాదకుఁడు :

డాక్టరు కే. యన్. కేసరి

GRIHALAKSHMI

సంపుటము ౧౭]    ఆగష్టు 1948    [సంచిక ౮










సాలుచందా మొదలగునవి

ఈ సచిత్రమాసపత్రిక సాలుచందా రు.4-8-0. అర్థసంవత్సరపు చందా రు.2-8-0. అంతకు తక్కువ కాలపరిమితి చందా పద్ధతిలేదు. విడికాపి ఆరు అణాలు. చందాదారులు ఏమాసమునుండియైన ప్రారంభము చేయవచ్చును. విడికాపీలు వలయువారు వాని విలువమేరకు తపాలాబిళ్లలు పంపవలయును. వీ. పీ. పద్ధతి వ్యయమూలకము. బర్మాకు రేట్లు ప్రత్యేకము.

ప్రకటనలు

ముఖ్యముగా స్త్రీలకందీయవలసిన వస్తువులనుగూర్చి ప్రకటించుటకీపత్రిక ఎంతయు అనువైనది. ప్రకటన చార్జీలు ప్రతిమాసము ముందుగానే చెల్లింపవలయును. కాలుపుటకు తక్కువయైన ప్రకటనలు చేకొనజాలము. రేట్లకొఱకు వ్రాయునది.

వ్యాసములు వ్రాయువారికి

వ్యాసముల ముఖ్యాశయము స్త్రీజనాభ్యుదయమైయుండవలెను. అవి సంగ్రహముగ నున్న శీఘ్ర ప్రచురణకు వీలగును. ఒకేప్రక్క సిరాతో స్పష్టముగ తప్పులులేక వ్రాయవలెను. భాష గ్రాంధికముగాని, వ్యావహారికముగాని కావచ్చును; రెండును కలిపి వ్రాసిన అంగీకరింపబడవు. వ్యాసముల ప్రకటించుటలో సంపాదకులకు సర్వహక్కులు గలవు. ప్రకటింప నంగీకరింపబడినపుడు మాత్రము రచయితల కట్లు తెలుపబడును. విమర్శనార్థము పంపు గ్రంథములు రెండుప్రతులు పంపవలెను. రిప్లైకార్డు వ్రాసిననే బదులివ్వబడును.

సంచికలు చేరనిచో

సంచికలు చేరనిచో ఆయామాసములందు వెంటనే మాకు తెలుపవలయును. చిరునామామార్పును తెలుపకుండుటచే కాపీలు చేరనివారికి తిరుగ పంపజాలము. సంచికలు చేరనివారు తమతమ పోస్టాఫీసులలో కంప్లైంటును చేయునది.

చిరునామా మార్పు

చిరునామాయందు మార్పుఉండుచో ముందుగానే తెలుపవలయును. ఇట్లు తెలుపనిచో కాపీలు తిరుగ పంపజాలము.

ముఖ్యమైన గమనింపు

చందాదారులుగ చేర్చుకొనుమని వ్రాయు ఉత్తరములు, ఇతరమైన ఉత్తరములు మానేజరు, గృహలక్ష్మి, రాయపేట, మదరాసు అను చిరునామాకే వ్రాయవలయును. చెక్కులు, మనియార్డర్లు, పోస్టలు ఆర్డర్లు 'కేసరికుటీరం లిమిటెడ్' పేర పంపవలెను.

చెక్కులు మద్రాసు బ్యాంకులపైననే పంపవలెను.

# విషయసూచిక






:జండూ బాలామృతం:




క్షీణించి అనారోగ్యవంతులుగ
నుండు బిడ్డలకు అమృతము
సీసా 1-కి రు 1-1-0.
జండూవారి ఏజంట్లయొద్ద దొరుకును.

# గృహలక్ష్మి ఏజంట్లు:

గుంటూరు: వెల్కం & కో.
చిత్తూరు. వి. చెన్నకేశవులు నాయుడు.
కర్నూలు: బాలసరస్వతి బుక్‌డిపో.
బెజవాడ: మోడరన్ న్యూసు ఏజన్సి.
కాకినాడ: సి. హెచ్. కే. మూర్తి.
అనంతపురము: వై. సాంబయ్య.
ఒంగోలు: పి. యస్. నాయుడు.
భద్రాచలం. దొమ్మగూడెం గారిదేవిపేట: టి. వి. జి. ఆర్. మూర్తి
నర్సాపూరు: వై. సుందరరామయ్య.
కావలి: జి. రంగయ్య.
మారుటేరు: వి. వి. సుబ్బారావు.
గుడివాడ: యం. రామమూర్తి పంటు.
విజయనగరము: డి. సన్యాసయ్య.
పిఠాపురము: యం. సూరిరాజు.
కళ్యాణదుర్గం: కే. మల్లప్ప.
నిడదవోలు: కే. వి. సి. అయ్యర్.
మచిలీపట్నము: టి. బి. నారాయణసింగ్.
నంద్యాల: జి. నారాయణశెట్టి.
ఏలూరు: నేషనల బుక్కుడిపో.
రాజమండ్రి: నేషనల్ ఏజన్సీస్.
తుని: కోడూరు. సూరిరాజు.
బరంపురం: కే. వి. రంగారావు.

అనకాపల్లి: పి. వీరునాయుడు.
నెల్లూరు: వి. ఏ. నారాయణరావు.
అకీడు: వి. లక్ష్మీనారాయణ
భీమవరం: యన్. సూర్యనారాయణ.
పొన్నూరు: చౌదరి ఖాదీస్టోర్సు
మదనపల్లి: యన్. రాధాకృష్ణయ్య
అంబాజీపేట: పి. రామమూర్తి.
చికాకోలు: బి. యన్. మూర్తి.
వసంతవాడ: యస్. కె. శర్మ.
ఖర్గపూరు: యస్. వి. నాయుడు.
కొక్కలి: శివల ఆంజనేయమూర్తి.
పార్వతీపురము: ఎ. వి. వి. యన్. మూర్తి.
తిమ్మనచర్ల: రాయలసీమ న్యూసుమార్టు.
వాల్తేరు: సిటి. న్యూస్. ఏజన్సి.
చల్లపల్లి: బి. ఆంజనేయులు.
జగత్యాల: కాసం, శివరాజగుప్త & సన్సు.
రంగూన్: నేషనలుస్టోర్సు.
ఎలమంచిలి: కే దీనులు.
బాపట్ల: యల్. వి. రాంమోహన రావు.
నర్సిపట్నము: సి. రామన్.
జంషెడ్‌పూర్: యం. శ్రీరాములు.
హిగిన్‌బాతమ్‌స్టాలులవద్ద దొరకును.

 ఇతర చోట్లకు ఏజంట్లు కావలయును. దరకాస్తుపంపుకొనుడు.



"సాష్టాంగ నమస్కారముసేతును ఇష్టములీడేర్చు ఇందిరారమణీ"




జయజయ గృహలక్ష్మీ సఖి! జయజయ లలితాంధ్ర మధుర సారస్వతమా!
జయజయ లలనారత్నమ! జయజయ విద్యాప్రబోధ! జయ కల్యాణీ!

# ప్రథమ భారత స్వాతంత్ర్య జన్మదినోత్సవం

ఈ ఆగస్టు 15వ తేదినాటికి భారతదేశానికి స్వాతంత్ర్యం సిద్ధించి సంవత్సరమైంది. కాబట్టి భారతీయులు ప్రథమ భారత స్వాతంత్ర్య జన్మదినోత్సవాన్ని యథోచితంగా జరుపుతున్నారు. 'గృహలక్ష్మి'న్నీ ఉత్సాహంతో ఈ ఉత్సవంలో పాల్గొంటూఉన్నది.

ఈసమయాన ఈసం॥లో మనకు కలిగిన అనుభవాలు పునశ్చరణచేయడం న్యాయం.

అసలు మనకు సంప్రాప్తమైన స్వాతంత్ర్యంలోనే రెండు లోట్లున్నాయి. మనకిష్టంలేకపోయినా - దేశవిభజనను, బ్రిటిష్ డొమినియన్ ప్రతిపత్తిని వప్పుకొని స్వాతంత్ర్యం కొనుక్కొన్నాము.

దేశవిభజనవల్ల పాకీస్థానం బడసిన మన మిత్రులంతట సర్దుకోలేదు. పాకీస్థాన్ పంజాబులోను, అందుకు ప్రతిగా భారతయూనియన్ పంజాబులోను మితిమీరిన దుండగాలుజరిగాయి; రక్తప్రవాహాలైనాయి; లక్షలాది స్థలాంతరులై నిరాధారులైనారు; వేలాదిస్త్రీలు చెరపెట్టబడ్డారు. ఇంకా ఆ హల్లకల్లోలం ఫలితాలు చక్కబడలేదు. పాకీస్థాన్ కాశ్మీరంలో అల్లరులు లేపింది; యుద్ధం సాగిస్తున్నది. ఆ తగాదా యింకా పరిష్కారము కాలేదు. ఆ ఆసరా, ఈ ఆసరా చూచుకొని హైదరాబాదు నైజాము భారతయూనియన్‌లో స్థిరంగా చేరక రజాకర్లనే దుండగీండ్రను విచ్చలవిడిగా వదిలాడు. వాళ్లు నైజామురాజ్యంలోను సరిహద్దులలోను అల్లరులుచేస్తూ హిందువులను బాధిస్తున్నారు.

నేడో రేపో - నెయ్యంచేతనో; కయ్యంచేతనో ఈ సమస్య పరిష్కారం కావలసిఉంది. కయ్యమే అయితే - నైజాములో హిందూస్త్రీల మానప్రాణాలపై ఆశ వదులుకోవలసిందే!

భారతయూనియన్ నంటి ఏర్పడ్డ పాకిస్థాన్ స్థితి ఇట్లా వైరుధ్యంగాఉంది. ప్రపంచంలో శాంతి స్థాపన కాలేదు. మూడవ ప్రపంచయుద్ధపుగాలులు వీస్తున్నవి. నూతన రాజ్యాంగచట్టంద్వారా సంపూర్ణస్వాతంత్ర్యం-వహించడానికి అవకాశముండిన్నీ - బాల్యావస్థలోనున్న భారతయూనియన్ ఇప్పుడా సాహసానికి పూనవచ్చునా అని నాయకుల కాలోచన లారంభమైనాయి. నెహ్రూ ప్రధాని ఇంగ్లాండు వెళ్లివచ్చేదాకా ఈ సంగతి తేల్చజాలరు. తన్మూలంగా అసలు చట్టమే ఆలస్యమవుతున్నది.

స్వాతంత్ర్యంసిద్ధించడంతో ప్రాచ్యదేశాలకు నాయకత్వం వహిస్తామనుకున్నాము. వారూ అలాగే ఆశించారు. చీనాలో అంతఃకలహం సమయలేదు; మలయాలో స్థిమిత మేర్పడలేదు; ఇండొనేషియా స్వాతంత్ర్యసమరం ముగియలేదు. బర్మాకు స్వాతంత్ర్యం వచ్చిన్నీ కమ్యూనిష్టుల దురుసు నెదుర్కొంటున్నది. మన స్థితిగతులే చక్కబడనందున మనం వారికి ఏవిధమైన సహాయం చేయలేక సానుభూతిమాత్రం చూపుతున్నాము.

చికాకుకలిగించే పైపరిస్థితుల్లో - స్వాతంత్ర్యం సిద్ధించిన్నీ - సామాన్య పరిపాలనా వ్యవహారాలలోనైన చక్కని మార్గాల నిర్మించి ప్రజాసౌకర్యం చేకూర్ప వీలైందికాదు. ఉన్న అన్నవస్త్రాలనైనా తిన్నగా ప్రజలకందజేయలేకున్నారు. 47 ఆఖరులో గాంధీగారి సలహాపైన అన్నవస్త్రాలపై కంట్రోలు తొలిగించారు. దానివల్ల రెంటిధరలు పెరిగిపోయినవికాని ఉత్పత్తి హెచ్చలేదు; పంపిణీ సక్రమంకాలేదు. ఒక్కవస్త్రం - 3 రెట్లు దాకా ధరపెరిగింది. తిరిగీ కంట్రోలు ఏర్పరచమని ప్రజలు గోలపెడుతున్నారు; వస్త్రానికి కంట్రోలు అప్పుడే ఏర్పడ్డది. పరిశ్రమలు, విద్య, ఆరోగ్యము, వ్యవసాయము, - మున్నగు అన్ని శాఖలలోను ప్రణాళికలు యోచింపబడుతున్నాయేగాని ఇంకా సరియైన రూపు రేఖ లేర్పడలేదు.

స్త్రీలు సంతోషింపదగ్గ రెండుకార్యాలు జరిగాయీసంవత్సరంలో. నూతన రాజ్యాంగంలో—ఏవిధంగాను స్త్రీ పురుష విభేదము ఎందునా ఉండరాదని నిర్వచింప బడినది. ఐ. సి. యస్. స్థానే ఏర్పడబోతున్న యూనియన్ అధికారవర్గములో స్త్రీలను నియమించడానికిన్నీ నిర్ణయమైంది.

అన్నిటికన్నా గొప్ప అవాంతరం మరోటి జరిగింది. పెద్దగొడ్డలి మొక్కపోయి నట్లు భారతభాగ్య విధాత, ప్రపంచ శాంతి దూత - మన మహాత్ముడు 1948 జనవరి

30 తేదిన ప్రార్థనా పీఠమువద్ద హత్యగావింపబడినాడు. హఠాత్తుగా ఆ జ్యోతి ఆరిపోవడంచేత - ప్రపంచమంతా అంధకారం అలుముకొన్నది. నిరంతర సాన్నిధ్యమిచ్చి, అన్నిటా సలహాలొసంగే ఆ మహాత్ముడులేమి మన నాయకులు ఏ చిక్కు సమస్య వచ్చినా సంకటపడుతున్నారు.

అయితే ఒక్క అనుకూల పరిస్థితి కలిగింది. భారతయూనియన్‌కు బ్రిటిష్ గవర్నర్ జనరల్ ఉండమన్నా ఉండక వెళ్లిపోయినాడు. వారిస్థానే—శ్రీ రాజాజీ గవర్నర్ జనరల్ అయినాడు. కాబట్టి ఇప్పుడు మన స్వతంత్ర భారత రాజ్యపరిపాలన సాగిస్తున్నది—ఇన్నాళ్లు ఇందుకై పోరాడిన రాజాజీ, నెహ్రూ, పటేల్, అజాద్, ప్రసాద్, అమృతకుమారిగార్లు.

సంసారం అంటే — సుఖదుఃఖాలు రెండూ కలిసిఉంటాయని "గృహలక్ష్మి"కి చెప్పనక్కరలేదుగదా. భారతమాత సంసారమూ అంతే. అయితే ఈవిధంగా స్వాతంత్ర్య సిద్ధి అనంతరం ప్రథమ సంవత్సరంలోనే మన వ్యవహారాలింత కలగాపులగంగాఉన్నా యని మనం నిస్పృహచెందనక్కరలేదు. ఇది ప్రజాస్వాతంత్ర్యయుగం. మనకు సిద్ధించినది కూడా ప్రజాస్వాతంత్ర్యం.. కాబట్టి ప్రజలు ధైర్యసాహసాలతో, దీక్షాదక్షతలతో నిర్మాణాత్మకమైన కృషివిమర్శనలతో — ముందుకు సాగిపోయినారంటే—శాంతి సౌఖ్యాలకు భారతభూమి పుట్టిల్లుకాక తప్పదు.

ప్రజలు అంటే—స్త్రీ పురుషులంతాకలిసి. కావున నెహ్రూ కోరినట్లు స్త్రీలుకూడ పురుషులతో కలిసి పాటుపడి మనకు సంప్రాప్తించిన స్వాతంత్ర్యం సార్థక మొనర్తురుగాక యని "గృహలక్ష్మి" ఆశిస్తున్నది.

## స్వాతంత్ర్య జన్మదినోత్సవపు అభివందనాలు

పాఠకులకు, మిత్రులకు, అభిమానులకు ప్రథమ భారత స్వాతంత్ర్య దినోత్సవమునాడు రాగల సంవత్సరమంతయు శుభ పరంపరలు చేకూరుగాక యని ఆశించుచు "గృహలక్ష్మి" తన అభివందనము లొనర్చుచున్నది.

# బాలప్రహ్లాద

౧ రంగము


కవయిత్రి: శ్రీమతి కనుపర్తి వరలక్ష్మమ్మగారు

ఇందు వచ్చుపాత్రలు

హిరణ్యకశిపుడు — ప్రహ్లాదుని తండ్రి
ప్రహ్లాదుడు - కథానాయకుడు.
చండామర్కులు - ఆచార్యులు.

కాలాహి
గరళకంఠుడు
భైరవుడు
భేతాళుడు
} రాక్షస బాలురు

లీలావతి — ప్రహ్లాదుని తల్లి

మాధవి
మల్లిక
} చెలికత్తెలు

[సూచనలు: హిరణ్యకశిపుడు ఇటు పుత్రప్రేమను అటు దర్పరోషాదులను, ప్రదర్శింపగలవాడై యుండాలె. ప్రథమరంగంలో ప్రహ్లాదుడు అయిదారేండ్ల వయసు గలవాడైయుండాలె. ఆ పైరంగాల్లో ప్రహ్లాదుడు పదేండ్లవాడైఉంటే బాగాఉంటుంది. సమాయానుకూలంగా విష్ణుకీర్తనలు, భాగవతపుపద్యాలుపాడుకోవచ్చును. హిరణ్యకశిపుడు పద్యాలు చదవలేకపోతే వదలినా కథకు లోపంలేదు. అయిదవరంగం ప్రారంభంలో డ్యాన్సు పెట్టవచ్చు. కొద్ది పిల్లలతో పాఠశాలలలోను, సమాజవార్షికోత్సవాలలోను ప్రదర్శించడానికి అనుకూలంగా యీ నాటిక వ్రాయబడినది.]

ప్రదేశము: లీలావతి అంతఃపురము

[లీలావతి పూలమాలలు కట్టుతూ సోఫామీద కూర్చుండి ఉంటుంది. ఎదురుగా ఒక ఎత్తుపీటపై శ్రీ మహావిష్ణువు బొమ్మ దానిముందు ఒకపళ్లెములో పూలు పండ్లువగైరా పూజాద్రవ్యాలు ఉంటవి.]

హిరణ్యకశిపుడు:- (లోపలికివస్తూ శ్రీ మహావిష్ణువు బొమ్మనుచూచి చకితుడై) లీలావతీ ఏమిటిది? అంతఃపురము దేవాలయం చేసినావు? ఈ విష్ణుబొమ్మ ఎక్కడిది? ఈ పూజాద్రవ్యాలు ఇక్కడ పెట్టినదెవరు?

లీలా:- ఎవరున్నారు? మన ప్రహ్లాదుడే. ఎక్కడనో విష్ణుబొమ్మను తెచ్చాడు. ఇకదానిని బట్టుకొని దేవుడు దేవుడంటూ ఆటలు ఆడుతున్నాడు.

హిర:- దేవుడూ? దేవుడెక్కడున్నాడు? దానవకులాంతకుడైన నారాయణుడు దేవుడా? వానిని మనకుమారుడు పూజచేయడమా? లీలావతీ! నీకు మతిపోయినదా? పిల్లవానిచేత నిట్టిఆటలు ఆడనీయవచ్చునా?

లీలా:- ఎవరు ఆడనిచ్చారు! వద్దురా మీనాన్న గారుచూస్తే కోపపడుతారురా అని! వేవిధాలచెప్పినాఎప్పుడూ వాడికదేపిచ్చి. ఒక్కగానొక్క బిడ్డ, అంతంతలేని కష్టాలలో బ్రతికి బయటపడ్డాడు; అనికొట్టటానికి చేయిరాక, తిట్టడానికి నోరురాక ఊరుకుంటూఉంటే నానాటికి దేవుడిపూజ లెక్కువౌతున్నాయి.

హిర:- (నవ్వుతూ) నారదాశ్రమంలో పుట్టినబిడ్డ పరమభాగవతుడుగాక పరాక్రమోపేతుడౌతాడా? ఆజడదారి బుద్ధులే వీడికీ పట్టుబడినవి కాబోలు. లీలా! ఏడి అబ్బాయి?

లీలా:- పూలమాలలు కట్టమని ఇన్నిపూలు తెచ్చి యిక్కడపోసి అవిచాలవు మళ్లీతెస్తామురమ్మని మాధవిని వెంటబెట్టుకొని పుష్పోద్యానంలోకి వెళ్ళాడు.

హిర:- పసివాడుగదూ! ఏవో ఆటలు. రేపుబడిలో వేసితిమా అన్ని పూజలూ తగ్గును. వానిని కోపపడకు.

లీలా:- (విసుగుతో) ఏమి తగ్గుతాయో!

ప్రహ్లాదుడు:- (లోపలకివస్తూ) అమ్మా! అమ్మా! మాధవి నాదేవుడికెంత పూలదండ కట్టిందో చూచావా? బలేబాగుందమ్మా.




హిర:- (ప్రహ్లాదుడికి ఎదురుగాబోయి ఎత్తుకొని ముద్దాడుచు) నీ పూలదండ నా మెడలో వేయిబాబూ.

ప్రహ్లా:- నీవు దేవుడవా?

హిర:- ఆ! ఆ!! నేనే దేవుడను. నా మెడలో వేయి బాబూ. (అని వెంగ వంచుతాడు.)

ప్రహ్లా:- నీవు దేవుడవు కావు; నాన్నవు. (అని పూలదండ మెడలో వేయకుండా పక్కకు తీసుకుంటాడు.)

హిర:- నీదేవుడేమిదేవుడు! పట్టిమట్టిబొమ్మ? ఎత్తిపడవేస్తే, పదిముక్కలౌవుతాడు. నేనైతేనా ఎన్నైనా చేయగలను. ఈ సూర్యుడు నేను ఎండగాయమంటే కాస్తాడు. వద్దంటే మానుతాడు. ఈగాలి

వీచమంటే వీస్తాడు; వద్దంటే మానుతాడు. భూమి, ఆకాశము, నిప్పు; నీరు అన్నీ నాచేతులో ఉన్నాయి. నేను దేవుణ్ణిగాదూ మరి ?

ప్రహ్లా:- (కొంచెంఆలోచించి) అయితే వీనిని పుట్టించింది గూడా నీవేనా ?

హిర:- (విస్తుబోయి) అవి మునుపే పుట్టాయి.

ప్రహ్లా:- ఎవరూ పుట్టించకుండానే ? అయితే ఈ పూలమాల ఎవరూకట్టకుండా తయారుకాలేదేం ?

హిర:-(పకపకా నవ్వుతూ) ఏమి ఊహాలోయి నాన్నా (అని కుమారుని అక్కున జేర్చుకొనిముద్దాడుతాడు.)

లీలా:- వాడివన్నీ దిప్పకాయ మాటలే. వాడిని వాగించకండి.

హిర:- లీలా అబ్బాయిని ఎప్పుడు బళ్లో వేద్దాము ?

లీలా:- అయిదవఏడు వెళ్లిపోబోతున్నది. ఆచార్యులవారిచేత త్వరగా సుముహూర్తం నిర్ణయంచేయించండి.

హిర:- ప్రహ్లాద్ !

ప్రహ్లా:- నాన్నా !

హిర:- నిన్ను బడిలో వేస్తాము. ఆచార్యులవారివద్ద బాగా చదువుకుంటావా ?

ప్రహ్లా:- ఆచార్యులవారికి మంచి దేవుడికథలు వచ్చా ?

హిర:- ఛీ! ఛీ! వెధవ దేవుడికథలేమిటి? అంతకంటె మంచికథలూ, కావ్యాలు, శాస్త్రాలూ, పురాణాలూ ఎన్నోవచ్చు. చక్కగా చెప్తారు.

ప్రహ్లా:- అయితే నేను చక్కగా చదువుకుంటాను. (తెర) (సశేషము.)

---


# ఎక్కువ త్వరితంగాను, తక్కువ శ్రమతోను బార్లీగంజి యీవిధంగా తయారుచేయండి




ఐదు నిమిషాల్లో - రుచికరంగా హాయిగా ఉండే బార్లి గంజి పానీయము సమ మట్టమైన రెండు టీస్పూనుల ప్యూరిటీ బార్లిని ముద్దగాచేసి. ఒక పైంటు నీళ్లలో కలిపి ఐదు నిమిషములవరకు మాత్రమే కాగనీయండి ఇది వాడుకలో చాలా కలసి వస్తుంది-పెర్ల్ బార్లికంటె ఎనిమిది రెట్లు ఎక్కువ శ్రేష్ఠమైనది.

సారవంతమైన శీతల ప్రదేశాల్లో పండే మంచి గింజలను పిండిచేసి పటులో సున్నితంగా వస్త్రకాళితమైన ప్యూరిటీ బార్లి ఆరోగ్య శాస్త్రయుక్తముగా డబ్బాలలో సీలు చేయబడు చున్నది



అట్లాంటిస్ (ఈస్టు) లిమిటెడ్., 20. 1. చెట్లారోడ్, కలకత్తా.

దక్షిణ ఇండియాకు సోల్ ఏజంట్లు : ప్యారి అండ్ కో లిమిటెడ్., పోస్టుబాక్సు 12, మదాసు.

# శ్రావణ శుక్రవారము వరలక్ష్మీదేవిపాట

[శ్రీమతి నంబూరు రామతిలకమ్మగారు, చెన్నపురివాసులు, అనుశ్రుతంగా తమయింట్లో పాడుకొంటూన్న పాట అని వ్రాసిపంపారు. గృ॥ సం॥]

శుక్రవారపులక్ష్మీ శుభమివ్వవమ్మా
చక్రపాణి రాణి చేరి కొలిచెదను ॥శుక్ర॥

ధ్యానముజేసెద, గానముతోను,
ఏణాక్షి నావంటి దీనను బ్రోవు ॥శుక్ర॥

ఆవాహనముసేతు, భావములోను
పావనగాజేసి సేవ యొసంగు ॥శుక్ర॥

భాసురముగ కనకాసనమిత్తు,
దోషములణచి నీదాసిగజేయు ॥శుక్ర॥

అర్ఘ్య-పాద్యముల నీ కమరనిచ్చెదను
విఘ్నములణచుమీ వేగముగాను ॥శుక్ర॥

పంచామృతస్నాన మంచితముగను
పంచబాణునిగన్న పద్మాక్షి నీకిత్తు ॥శుక్ర॥

పన్నీరుస్నానము వన్నెమీరగను
పన్నుగగావింతు పాలింపుమమ్మా॥ శుక్ర॥

శుద్ధోదకస్నానం సొంపుమీరగను
శ్రద్ధగనీకిత్తు శౌరిపట్టపురాణి ॥శుక్ర॥

ఆచమనమునిత్తు ఆనందముగను
భూచక్రపాలిని యోచించకమ్మా ॥శుక్ర॥

బంగారుచీరల, బాగుగనిత్తును
శృంగారముగనీకు అంగజజననీ ॥శుక్ర॥

రంగైనరవికల రమణనొసగెదను
మంగళములనిమ్ము మహాలక్ష్మిమాకు॥శుక్ర

ఉపవీతమునిత్తు చపలాక్షిరో నీకు
కృపజూచిబ్రోవవే కపటమెంచకను ॥శుక్ర॥

మంచిగంధమునిత్తు మహాలక్ష్మిరో నీకు
సంచితాఘముబాపి సౌఖ్యమొసంగు॥శుక్ర॥

మల్లెలుమొల్లలు మరువంపుసరులు,
ఉల్లమలరగనిత్తు పల్లవపాణీ ॥శుక్ర॥

ఆభరణములనీ కమరనిచ్చెదను
అంబుజనేత్రి నన్నాదరింపుము వేగ ॥శుక్ర॥

పసుపుకుంకుమనిత్తు పద్మాక్షిరో నీకు
పశువులశిశువుల నొసగవే తల్లీ ॥శుక్ర॥

తిలకముకాటుక దేవినీకిత్తునే
మొలకనవ్వులతోను మోమెత్తిజూడు॥శుక్ర॥

ధూపముమాఘ్రాణించి పాపములణచు నీ
ప్రాపుజేరితి జననీ కోపగించకుము ॥శుక్ర॥

దీపముగైకొని కాపాడవమ్మా
సాపరాధను నన్ను సదయత బ్రోవు ॥శుక్ర॥

కదళీనారికేళ ఖర్జూరఫలములు
కరమొప్పగైకొని కరుణింపవమ్మా ॥శుక్ర॥

పంచభక్ష్యక్షీర పక్వాన్నములను
అంచితముగ నీకు అర్పణజేతు ॥శుక్ర॥

కర్పూరవిడెమును నర్పింతుగొనుము
సర్పశయనురాణి తప్పులెన్నకుము ॥శుక్ర॥

నీరాజనమునిత్తు నిరతమునీకు
నీరజాక్షిరో నాదు నేరమెన్నకుము ॥శుక్ర॥

మంత్రపుష్పము సమర్పింతు వేడుకగ
కంతుజనకురాణి చింతలుబాపు ॥శుక్ర॥

ఆత్మప్రదక్షిణ మమరజేసెదను
ఆత్మేశ్వరీనీవు అతిప్రీతిగొనుము ॥శుక్ర॥

సాష్టాంగ నమస్కారము సేతును
ఇష్టములీడేర్చు ఇందిరారమణి ॥శుక్ర॥

ఛత్రచామరముల సరగనర్పింతును
పుత్రవంతులజేయు ధాత్రిలోమమ్ము ॥శుక్ర॥

నృత్యగీతములచే నిన్ను మెప్పింతును
సత్వవతినిగజేయు సరగ నన్ను ॥శుక్ర॥

నీ పూజజేసెద నీరజనేత్రి
నీభక్తమణిగాను నిలుపవేతల్లీ ॥శుక్ర॥

కోరిభజించెద మారునిజననీ
దారిద్ర్యములబాపి దయజూడుమమ్మా ॥శుక్ర॥

వేణుగోపాలుని రాణిమాయమ్మ
వాసిగ(శ్రీ)చెన్నపురిన వెలసితివమ్మా ॥శుక్ర॥

కలకాలముగ నిన్నుతలచువారలకు
కామితార్థములిచ్చి కరుణించవమ్మా ॥శుక్ర॥

ఈపాటపాడిన విన్నవారలను
చేపట్టిరక్షించు స్థిరముగ తల్లి ॥శుక్ర॥




అరుణ స్త్రీలకు వరప్రసాదం వంటిది. ఇది స్త్రీలకు కలిగే ఋతు సంబంధ వ్యాధులన్నిటిని పారద్రోలి జీవనమునకు ఆనందమును, మాధుర్యమును, సౌరభ్యమును చేకూర్చును.

ఆయుర్వేదాశ్రమం లిమిటెడ్, మదరాసు 17.

# చెన్నపురి స్త్రీలకు నెహ్రూ హితోపదేశము



"స్త్రీలలో సంచలనం కలగనిదే మన దేశం బాగా ముందుకుసాగిపోజాలదు." నాకు చిరకాలమునుండి గల అభిప్రాయమిది. పూర్వమెట్లయినా, ఈ రోజులలో స్త్రీలు ప్రభుత్వకార్యక్రమాలలో హెచ్చుగా పాల్గొనకపోతే, ఆ ప్రభుత్వము హెచ్చు అభివృద్ధి నందజాలదు. పూర్వపురోజులలో 'ప్రభుత్వము' అంటే పన్నులు వసూలుచేసి, ప్రజల ధనమానప్రాణాలు కాపాడడమే, అంటే పోలీసుపని. ఇప్పుడు ప్రభుత్వపు విధులు, సాంఘికమైనవి—విద్య, ఆరోగ్యము, పారిశుధ్యము, గృహవసతులు, ఆటపాటలు—ఒకటేమిటి, క్లుప్తంగా—జాతియొక్క బాగోగులన్ని దానిపనులే సంఘక్షేమపరాయణమైన ప్రభుత్వం పూర్వం మాదిరిగా కొలదిమంది రాజకీయవేత్తలతో సాగదు. నిజమే; శాసనములు గావింపబడవలసినదే. అయితే సంఘసేవాపరాయణమైన ప్రభుత్వానికి అండగా సంఘసేవాపరాయణులైన పౌరులు, స్త్రీలు పురుషులు నిలవాలి. లేకపోతే ఆ చట్టాలు నిష్ప్రయోజనము.

నేడు భారతదేశపు ప్రభుత్వము అట్టి సంఘక్షేమ పరాయణమైయున్నది. ఇప్పుడు మన సాంఘిక సమస్యలను రాజకీయదృష్ట్యాచూడరాదు. జాతిలోగల భిన్నవర్ణములకు ఔన్నత్యము చేకూర్చేయోచన చేయాలి, ఈ విషయంలో పురుషులకన్న స్త్రీలే హెచ్చుగా పనిచేయగలరు. అంటే మీరు కాన్ఫరెన్సులు సమావేశపరచి దీర్ఘమైన గంభీరోపన్యాసాలిమ్మని, తీర్మానాలు చేయమని కోరడంలేదు. అవి అప్పుడప్పుడవసరము అగుగాక. ముఖ్యమైనది నిర్మాణకార్యక్రమము. ఈ 30 సం॥లుగా గాంధీమహాత్ముడు రాజకీయ కార్యక్రమమునకన్నను నిర్మాణకార్యక్రమమునకే ప్రాధాన్యమిచ్చినాడు.

ఇప్పుడు దేశంలో జాతీయప్రభుత్వమేర్పడియున్నది. కాబట్టి స్త్రీలు, పురుషులు,—పురుషులకన్నా స్త్రీలే—ఏదో ఒక కార్యక్రమమునకు పూనుకోవలెను; అది ఆడంబరమైనది కాకపోవచ్చు; అదంటే మోజుకలుగకపోవచ్చు. కాని ఉపయుక్తమైనదైతే చాలు. ఆ పనివల్ల ఎవరినో ఉద్ధరిస్తూన్నామనే భ్రమలోపడకండి. మీరు పైనచూస్తూ ఆ పని చేసేకంటే ఇంట్లోఉంటేమేలు. ప్రపంచంలో నేడుగొప్ప వారమనుకొనే స్త్రీల ప్రయోజనము తగ్గిపోయింది. ఇప్పుడు కావలసింది శ్రద్ధాభక్తులతో పనిచేసేవారు. ఏదోకొందరికి ప్రత్యేకంగాగాక, ప్రజాసామాన్యానికంతా ఉపయుక్తమైన పనియేదోచేతబట్టి కృషిచేయండి.

గత ఆరుయేడునెలల్లో స్త్రీలు బహుముఖముల పనిచేసినారు. ఉత్తరదేశంలో గతసంవత్సరము వచ్చిన అల్లరులు మీకు తెలుసుగదా. దానివల్ల ఎంతోమందికి నిలువనీడలేకుండా పోయినది. వారుసర్వము పోగొట్టుకొని ఏకాకులైనారు. ఇట్టివారిని 60 లక్షలమందిని కాపాడవలసివచ్చినది. దీనికితోడు సోదరీమణుల నెందరో మతాంతరులు చెరపట్టినారు. ఉభయ మతాలవారూచేశారీపని. వారెందరు, వీరెందరు, అని సంఖ్యల తారతమ్యముచూడరాదు. అసలాకృత్యమే ఘోరమైనదారుణము. అట్టివారిని స్వస్థలంచేర్చేపని చేబట్టి కొంతమంది స్త్రీలు కృషిచేశారు. ఈపనిలో ప్రమాదములు చాలాఉన్నా వారుధైర్యంతో పనిచేశారు.

ఒక వీరవనితచరిత్ర చెప్తావినండి. కాశ్మీరులో ఒకజిల్లా మ్యాజస్ట్రేటు ఇంట్లోకి దురంతకులుదూరి ఆయనను తుపాకితో కాల్చి చంపివేశారు. ఆయన భార్యను, ఆమె 5 గురు బిడ్డలను చెరబట్టుకొని పోయినారు. ఆ బిడ్డలు 3 సం॥ మొ 14 సం॥ల వచ్చువరకు ఉన్నారు. వారిని కొండలలో దాచారు. ఆమోటు కొండవాండ్రమధ్య వారు 5, 6 నెలలుండవలసివచ్చినది. అయితే—ఆమె తన శీలసంపత్తివల్లా, ఇచ్ఛాబలమువల్లా—వారికీశ్వరియై అదుపాజ్ఞలలోనుంచి పనులుగొంటూ తిన్నగా తప్పించుకొని, శరణార్థుల బసకేవచ్చి చేరుకున్నది. వ్యష్టులుగా పనిచేయకండి, కలిసి సంఘములుగా పనిచేయండి.

మనమొక గొప్పజాతీయసౌధమును నిర్మించవలసియున్నది. ఒక్కొక్క ఇటుకగా అమర్చి దానిని మీరు నిరూపించవలెను. అందరూ దానికి చేయివేయవలె. మీరూ సహాయం చేస్తారుగదా. (24.7.48)



———:o:———

# విడాకులు కావాలి

శ్రీమతి సూర్యదేవర శకుంతలాదేవిగారు

●

విడాకులు కావాలిఅనేవారు వలదుఅనేవారు, చాలామంది వున్నారు. ఏ విషయమైన వారు నమ్మినదానిని మంచి అనివాదించువారు వున్నారు. ఎవరు ఏమనినను అనుభవముగలవారు స్వార్థములేక నిజముదాచక చెప్పవలెనంటె నేటి భారతస్త్రీలకు ':విడాకులు' అవసరము. నేను 27-7-47 'ఆనందవాణిలో' 'విడాకులుకావాలి' అని అభిప్రాయమువ్రాస్తూ వలదుఅనువారు తగుకారణమువ్రాసిన సమాధానము చెప్పగలను అని వ్రాస్తే కొందరు ఇది పాశ్చాత్యవ్యామోహమని 'విడాకులు' పొందిన పాశ్చాత్యులు హద్దుమీరి ప్రతిదానికి 'విడాకులు' ఇస్తున్నారు; అందుకువాళ్లు విడాకులుఅంటె భయపడుచున్నారు అని అంటారు. ఉంటే అలాంటివారు ఎక్కడైన వున్నారేమో. వారి తొందరపాటు చెడ్డతనము వారే బయటపెట్టుకున్నవారవుతారు. తగుకారణములేకుండా అయినదానికి కానిదానికి కదిలితేమెదలితే 'విడాకులు' ఇచ్చుకొనే ఏదేశస్తులుకాని ఎవరుగాని ఎన్నాళ్లు నమ్మికగా బ్రతుకగలుగుతారు? వాళ్లను ప్రజలు అసహ్యించుకోరా? అయినఅటువంటి తొందరమనుష్యులు విడాకులు తీసుకొనకపోయిన సంఘములోనే చాటుగా క్రుళ్లుబ్రతుకులు బ్రతికే పెద్దమనుష్యులు. నిజముగా తగుకారణములతో బాధపడుస్త్రీ ఎవతెగాని విడాకులుతీసుకొని చెడిపోదు. అలాగు కొందరు వున్నారని చూపుతారా? ఏమి వద్దని ఇళ్లల్లో పతివ్రతల్లావుండి ప్రపంచంలోచూడని వినని దుర్మార్గమయిన పనులు చేసేవారికి ఎవరు, ఏబిల్లులు నేర్పినవి? ఏదో క్రొత్తమార్పువస్తే చెడిపోతాము అనుకొనేవారు మనస్సు స్థిమితములేనివారు, స్వార్థపరులుతప్ప ఎవరు కాదనరు. పూర్వము ఇది చెడుకావచ్చు. నేడు మంచికావచ్చు. రేపు అవసరము లేకపోవచ్చు. అందుకోసము ఈ బిల్లు అనవసరముకాదు. నేటిభారతస్త్రీలకు, సంఘములో నరకబాధలుపడు అభాగినులకు ఎంతో అవసరము. ఇంకా ఏమయిన ఇతరకారణములు చెప్పవలదు అనువారు మొండిగా వ్రాయక మనస్సుపూర్తిగా స్వార్థములేక అనుభవించిగాని అనుభవించువారిని చూచిగాని నిజమువ్రాస్తే చాల సంతోషము.

[ విశేఖరుల అభిప్రాయములకు పత్రికాసంపాదకులు బాధ్యులుకారు. గృ|| సం|| ]

---



# రీటా తలవెండ్రుకలను పెంచును

రీటా కుదుళ్ళకు బలమునిచ్చి నిగనిగలాడు నిడుపాటి వెండ్రుకలను పెంచుటకు అద్భుతమైన హెయిర్ టానిక్. తలవెండ్రుకలు రాలుట, నెరయుట, చుండ్రు, బట్టతల, పేనుకొరుకు ఇంకను తలవెండ్రుకలకు సంబంధించిన సమస్తవ్యాధులకు రీటా అమోఘముగ పనిచేయును. వేనకువేలు వాడి గుణమును పొందియున్నారు. మీరుకూడా నేటినుండియే రీటా వాడుడు.

రీటా ప్రతిచోటా దొరకును. వెల సీసా 15 అణాలు.

## హిందీ, ఆంధ్ర, తమిళ, కన్నడ తారల ప్రశంసలు

**లలితాపావర్ :** ఉత్తమమైన హెయిర్ టానిక్ కోరేవారికి రీటాకు మించినది మరేదీలేదు. దానిని వాడితే వారు మనమాతృభూమి అనేక శ్రేష్ఠమైన వస్తువులను ఉత్పత్తి చేయగలదని గ్రహించుకోగలుగుతారు.

**సుశీల్‌కుమార్ :** రీటా శిరోజాల వృద్ధికి మిక్కిలి సంతృప్తికరమైన సాధనం. శిరోజాలు రాలిపోతున్నపుడు నివారణకు, బుద్ధినైర్మల్యానికి ఎల్లరూ ఎప్పుడూ రీటానే వాడాలని సిఫారసు చేస్తున్నాను.

**కన్నాంబ :** రీటా నాకు పరిపూర్ణమైన తృప్తికలిగించినదని తెలుపుటకు మిక్కిలి సంతోషముగానున్నది. అది నిజముగా అమోఘమైనది.

**పుష్పవల్లి :** నాకు సుమారు ఏడాదిగా తలవెంట్రుకలు రాలిపోతున్నవి. రీటా వాడినప్పటినుండియు, తలవెంట్రుకలు రాలుట తగ్గింది. ఇది చాల శ్రేష్ఠమైన హెయిర్ టానిక్ అని నా అభిప్రాయము.

**సూర్యకుమారి:** రీటా మంచి సువాసనకలిగి, వాడినవారికి ఎంతో చల్లదనము చేకూర్చును. ఇకమీదట ఎల్లప్పుడు రీటానే వాడవలయునని నేను ఒక నిశ్చయమునకు వచ్చితిని.

**కృష్ణవేణి:** రీటా చక్కని సువాసనగలిగి, మనస్సునకు ఆహ్లాదాన్ని కలిగిస్తుంది. తలవెంట్రుకలను రాలకుండాచేసి, క్రొత్త వెంట్రుకలను పెంచుటకు రీటా సాటిలేని హెయిర్ టానిక్.

**ఆర్. పద్మ:** నా ముఖసౌందర్యమును పెంపొందించే శిరోజాలకు రీటాయే కారణము. స్వల్పకాలములోనే రీటా అద్భుతముగ గుణము నిచ్చినది.

**లక్ష్మిబాయి:** తలవెండ్రుకలను పెంచుటకు రీటా అమోఘముగ పనిచేసినది.

**వసుంధరాదేవి:** శిరోజాలు దీర్ఘంగా నిగనిగలాడుతూ ఎదగడానికి, శిరోజరక్షణకు రీటా అమోఘమైనదిగ రుజువైనది.

**రాజమ్మ :** శిరోజ సంబంధమైన బాధల నివారణకు రీటా అమోఘమైనది. గుర్తించుకున్నాను. శిరోజవృద్ధికి, రక్షణకు ముఖ్యమైన వస్తువులు రీటాలోవున్నవి. దీర్ఘ వినీలకుంతలాలు ఆశించే మహిళలందరూ దీనినే వాడాలి.

# రీటా హెయిర్ టానిక్

# మగవాళ్ల దుండగాలు

ఏమండోయ్. మిమ్మల్నే. ఏమిటలా ఆలోచిస్తున్నారు? ఏ మిష పెట్టుకొని యింటిలోనుంచి దాటేద్దామనా. ఇంట ఉండుటే అపురూపం. మీ స్నేహితుడనైనా బాగుండేది. సాయంత్రం 5 గం॥ అయినదిమొదలు పలవరించుకపోతారు షైరు, షైరని. వానపడ్డాసరే ఆ గోపీయింటికయినావెళ్లి కూర్చుని వస్తారు. ఒక్కరోజు అతన్నిచూడకపోతే నిద్రపట్టదుకాబోలు. చచ్చేమో బ్రతికేమో అనిగూడా మమ్మల్ని అడుగుతారా!

ఏమిటే! సాధింపు ప్రారంభమయింది. షైరులోఉన్నంతసేపు హాయిగాఉంటుంది ప్రాణం.

పాపం ఆ సాయంత్రం యెల్లప్పుడూ అట్లానేఉంటే బాగుండేది. సుమతికిఉన్న శక్తి మీకేఉంటే 'తెల్లవారకుండుగాక' యని ఆమె శపించినట్లే 'చీకటిపడకుండుగాక' యని శపిస్తారుగాబోలు.

నేను నీతో మాట్లాడలేను, జానకీ!

అమ్మో, ఇంతసేపటికి నోటినిండా 'జానకీ' అని పిలచారు. చాల సంతోషమయింది; ఇహ వెళ్లండి షైరు. నాకుమాత్రం ఏంకావాలి చెప్పండి. పగలల్లా చాకిరీచేసిచేసి ఉంటామేమో, నోటినిండా మాట్లాడి చిలకా గోరింకలవలె మనంఉంటే మనయిల్లు 'స్వర్గసీమ' యే గదండీ, గాని సుజాత ప్రవేశింపకుండా ఉండాలి!

బాగుంది. సినీమాలు చూస్తున్నందుకు నేర్చుకున్నది యిదా!

సినీమాలేగాదు మీ పురాణములే తియ్యండి. ప్రతిదానిలోకూడా మీ మగవాళ్లదుండగాలెట్లాఉన్నాయో చూడండి. నిద్రలోనున్న దమయంతిని వదలి నలుడుపోలేదా? తనభర్తయే దైవమనినమ్మి లంకలో ఉన్నంతకాలం రామునిస్మరణచేయుటలోనే కాలంగడపిన జానకిని గర్భవతియైనదైనా తలపక శ్రీ రాముడు అరణ్యములపాలు చేయలేదా? ఇహ పాండునందనులంటారా? పాంచాలివలువ నిండుసభలో దుశ్శాసనుడు విప్పుటకుప్రయత్నిస్తూంటే చూస్తూ ఊరుకున్నారు. యేమేనాఅంటే ధర్మానికి కట్టుబడ్డామంటారు. భార్యమానంకాపాడుటకన్న గొప్పధర్మమేది చెప్పండి. ఇహ ఆ నల్లవాని(కృష్ణుని) మాయలు, ఏడిపించుట చెప్పతరముగాదు. ఈ ఏడ్పించేవారిలో అగ్రగణ్యుడు! అందరూ తమభార్యలనే గాని ఆ కృష్ణుడు అందరినీ ఏడ్పించడమేగదూ. ఇదేమిటండీ అన్యాయం పురాణపురుషులే అట్లాఉంటే, ఇహ మీలాంటివాళ్లసంగతి అడుగాలా.

ఏమిటీ? వారు ఆదర్శమని అంటున్నారా. అవును మమ్మల్ని యింకా అణచుటకు యీ శాస్త్రాలు, పురాణాలు మీకటువంటివారినే ఆదర్శముగ చూపిస్తాయి. మాకుమాత్రం అగ్నిప్రవేశం చెయ్యమనుటే తడవు లేక కడీఐన సీత, తనఖడ్గమునకు బలికమ్మంటే సిద్ధపడిన చన్ద్రమతి వీళ్లు ఆదర్శములు. మీ మగవాళ్ల నిరంకుశ ప్రభుత్వం సాగడానికి యీ కథలన్నీ ఉపమానములుగా, ప్రమాణములుగా తీసుకుంటారు.

ఇప్పుడీకథలు జరుగలేదనికాదు నేననేది. అంత అమాయికంగా సీతకాలంనుండి మేమున్నామూపై దయొనాలేక యిప్పటివరకు మా స్వాతంత్ర్యం అరికట్టారే. మీఅంతట మీరు స్వాతంత్ర్యం యిస్తారామాకు. ఇంతకూ ఒహరిచ్చేది స్వాతంత్ర్యమేమిటీ. ఎవరంతట వారలు తెచ్చుకోవాలిగాని. కైక కవరిచ్చారు చెప్పండి. శ్రీమన్నారాయణుని అవతారమైన రామునే అడవికిపంపిందే. పాపం అహల్య దురుద్దేశమేలేక తనపతియే అని నమ్మి ఇంద్రునితో కలసినందున ఆమెభర్త శపించాడే. యేనిదర్శనం చూచినా మీ మగవాళ్లదుండగాలే కనబడుతాయిగదండీ. కేవలం మిమ్మల్నని లాభంలేదండీ. మాఆడవాళ్లు చచ్చుదద్దమ్మలు కాబట్టి మీ ఆటలుసాగినవి. రష్యాలోమాదిరి ఎప్పుడో పెద్ద మార్పురాగలదు!

పోనీ మంచిదేగదూ. విజయలక్ష్మీ పండిట్ అంత దానవౌదువుగాని!

అయేటట్టే ఉన్నారెండీ. అందుకైనాచదువు చెప్పించారు గనకనా. మేమేమైనా అంటే 'స్త్రీ స్వాతంత్ర్య మర్త్వాతి' అనియంటారు.

మాకు సీతను, సావిత్రిని ఆదర్శములుగా చూపుతారుగదా, మీరుకూడా రామునిలాగ ఏకపత్నీ వ్రతులుగా ఉండరాదూ. మనోవాక్కాయ కర్మలతో ఎలాగూ ఉండలేరు. యెందుచేతంటే మీ మనస్సు మారుతివంటిదిగనక. పోనీ 'కాయేన' అయినా ఉండకూడదాయని. పోనీ ద్రౌపతికూడా పతివ్రతేకదా మేము ఆమెను నిదర్శనంగా తీసుకుంటామంటే పనికిరాదూ. మీకుమాత్రం ఆ గొల్లవాడు ఆదర్శమా. రాముని కాలంనాటి ఏకపత్నీవ్రతం కృష్ణావతారంనాటికి బహుభార్యాత్వంకు దిగింది. స్త్రీలలో కూడాఅంతే. ద్రౌపతికి ఐదుగురు భర్తలు. ఏమేనాఅంటే వారిది శరీరసంబంధమైన ప్రేమ కాదంటారు. పోనీ మేంకూడా మనస్సుతోనే ప్రేమిస్తాం అందరినీ; వప్పుకుంటారూ. ఈ కట్టుకున్న ఒక్క భర్తనే యెన్నుకునేందుకు స్వతంత్రంలేనిమాకు అందరు భర్తల్ని కలిగియుండుటకు మాకవకాశమేదీ. మీదుమిక్కిలి అపవాదులు వేస్తారు. పురాణ కాలంనాడే నయం. స్వయంవరంఉండేది. అంతపాటి నాగరికతయినాలేదేమండీ ఇప్పటి ఈశాస్త్రుల్లవారికి. మీకు అనుకూలంగానున్నవన్నీ నిదర్శనములూ, లేనివి మానేస్తారూ. చాలబాగుంది కాదండీ. ఏం న్యాయం.

మొన్న మామగారు పోయినపుడు కొడుకు, కోడలు, భార్యా అంతా గరుడపురాణం వినాలంటే విన్నాను. భర్తచెప్పినట్లు చేయనిభార్యను రౌరవాది నరకాలని రాశాడుగాని భార్యలనేడిపించినమీబోటి భర్తలకు ఏగతులున్నాయో ఎక్కడయినారాశాడూ? దాన్నిబట్టి ఏమిటండీవ్యక్తమౌతుంది? ఈ పురాణములు, శాస్త్రములు మానవనిర్మితములనిగాదు? స్త్రీని అణచుటకు చేసిన మీ పెద్దల కృషిఫలితంగాదండీ యిది. 'చెప్పేవి శ్రీరంగనీతులు. దూరేవి దొమ్మరిగుడిసెలు' అన్నట్లు గృహసామ్రాజ్యమునకు రాణి అని యేవో పెద్ద బిరుదులియ్యడం, బానిస చాకిరీ మాచేతచేయించుకోడము.

ఇహ లెక్చరు పూర్తయిందా. అరగంటకుపైగా లేటయింది. మామిత్రమండలి ఈపాటికి సమావేశమైనా అలస్యమునకు కారణం ఏమిటాయని చర్చ (Comment) చేస్తూయుంటుంది.

మరేంపనీలేదండీ మీ మిత్రులకు. అగ్గికత్తెరలోకూడా ఐదున్నర గంటలకే ఎండలో ఆదిబ్బలపై కొలువుతీరకపోతే చల్లబడ్డాక వెళ్లకూడదూ. వాడిపెళ్లాం పురిటికెళ్లిందంటే, వాడిపెళ్లాం కడుపుతో ఉందని-యివేకదూ కబుర్లు. పెళ్లాంలేనివాడొకడూ, ఉన్నా పుట్టింటికి పంపినవాడొకడు, పాపం, చదువు పూర్తికాకుండానే మొదటిభార్యపోతే మళ్లీపెండ్లికి మీకుమల్లే ప్రయత్నాలు జరుపుతున్న వాడొకడు. వీరేగా, మీ మిత్రమండలి. 'అల్లుల్లోకి మల్లుపెద్దని' వారిలోకల్లా మీరే కాబోలు. పురాణామనుష్యులు. వారిముందర గాంధి, క్రీస్తుప్రభువు, గౌతమబుద్ధుడుమాదిరి యుంటారుమీరు. ఇంట్లో మీరుకాల్చిన కాల్పు యింతా అంతానాండీ. ఓ పర్యాయం తీసుకరండీ మీ స్నేహితులను మనయింటికి. మీ సంగతితెలుస్తుంది. అయితే ఒహటిలెండి. ఎవరయినాఉంటే యెంతో అనుకూలంగా ఉన్నట్టుంటారు. నేను ఒంటరిగా ఉంటేనే యిట్లాయేడిపించేది.

పాపం, నావల్ల యివాళ చాల ఆలశ్యమయినట్లుంది. మీషైరుకి వెళ్లండిపాపం.

అమ్మ బ్రతుకుజీవుడా, అని యివాళకీబాధ వదిలించుకుంటున్నారా! అంత కష్టంగాయుంటే ఒక్క నిమిషమైనా ఉండమనిచెప్పడం నాదేతప్పు. మీయిష్టంవచ్చినట్లు చేయండి. ఆలశ్యంగావస్తే మీఅమ్మగారికి మీరే సముజాయిషీ చెప్పుకుందురుగాని. నేను గనకనా నోరుమూసుకొని ఊరుకొనేందుకు.

"కల్యాణజానకి"

---

# "నాథా!"



అందం ఆనందం
పూరిగుడిశకు పేరంటానికి వచ్చాయి.

ప్రాణసదృశ బంధుఁడుగద పతిసతులకు.
దైవతుల్యుఁడుగాడె భర్త వనితలకు.
దివ్యభాస్కరాత్మజ్యోతి స్త్రీలకు పతి.
పతియె మరఁదప్ప యికేది గతిపడతికి?

ధనమొసంగిన నోర్వంగ దగునుగాని
అన్యవనితకు మనసీయ నాగునెట్లు?
అందుఁ గన్నారజూచి యెట్లాలియోర్చు?
భావకవులైన మీకుఁ జెప్పంగవలెనె?

పరసతీగమనమున రావణుఁడుచెడడె!
భ్రాతృభార్యను గూడిన వాలిచెడడె?
అన్యకాంతాగమనము శ్రేయస్సుగాద
టంచు మీకుఁ జెప్పఁగలదె?
యబల యొకతె!

"శరదాంబుద చలచిత్తులు
పురుషు" లనినయార్యవాక్యము
నిజంబయ్యెన్
సరసకవులైన మీకె
వ్వరనుచిత మిది యని జెప్పవలె
నో నాథా!

యౌవనలతను బెంచితి వడిచిగిర్చి
పుష్పముల బూయ మకరందమును
గ్రహించి
మధురఫలములనిచ్చు సమయములోన
అన్యలతగాంచి పీడ న్యాయంబెదాని?

మానాప్రగడ సూరమాంబ వేమూరి జ్ఞానాంబ.

# పాటూరి దంపతులు, నెల్లూరు



సుబ్బరామయ్యగారు బాలసరస్వతమ్మగారు

శ్రీమతి బాలసరస్వతమ్మగారు బాల్యమునందు 1917 లో విజ్ఞాన చంద్రికా పరిషత్తునందు స్వర్ణపతకములను బడసినవారు. 1920సం॥లో గాంధీగారి పిలుపు విని ఆసహాయోద్యమమునందు ప్రవేశించిరి. 1920-24 మధ్య మూడు లేక నాలుగుమార్లు 144 సె॥ ఉల్లంఘించి శిక్షింపబడిరి. ఖద్దరు విక్రయమునందును. రాట్నపు ప్రచారమునందును, కల్లుఅంగళ్ల, సీమగుడ్డల దుకాణములమందు పికెటింగ్ నందును. కృషిగావించిరి. తర్వాత ఉప్పుసత్యాగ్రహమునం దగ్రస్థానము వహించిరి. "శారద" యను సారస్వత మాసపత్రికకు సంపాదకురాలుగా నుండిరి. వ్యక్తి సత్యాగ్రహమునందు పాల్గొని అరెస్టుచేయబడిరి. వీరును, వీరిభర్త పాటూరు సుబ్బరామయ్యగారును నేటివరకు అనేక కష్టములకు గురియయ్యు కాంగ్రెసు సేవయందు నిమగ్నులై యున్నారు. ప్రస్తుతము కస్తూరీదేవి బాలికలహైస్కూలుగా బరగు కస్తూరిదేవి విద్యాలయమునందు ప్రధానోపాధ్యాయినిగానుండి పాఠశాలకు బియ్యము వసూలుచేయుట, ముంతలు పెట్టించుటలందు నాయకత్వము వహించిరి. శ్రీ మైదవోలు చెంగయ్య పంతులుగారి భార్య భ్రమరాంబగారిపేర నెలకొల్పబడిన గ్రంథాలయమునకు కార్యదర్శినిగా నుండిరి. 1939-40 లో 'యువతీసమితి' యను స్త్రీ సమాజమును స్థాపించి స్త్రీ సమాజమునందు ప్రబోధము జరుపుచుండిరి. 1947లో కస్తూరిదేవి జ్ఞాపకార్థము కస్తూరిబా సమాజమును స్థాపించిరి. వీరుఆంగ్లమందును, హిందీభాషయందును చక్కని పరిశ్రమచేసినవారు. వీరిభర్త సుబ్బరామయ్యగారన్నిటా వీరంతవారే.

# మన స్వాతంత్ర్యం మన కర్తవ్యం



భారత యూనియన్ ప్రధానమంత్రిత్వము చాలాగొప్పపని; బాధ్యతగలపదవి. అశేషభారతీయప్రజానీకమున్నూ సహకారంచూపనిదే ఆపదవి నిర్వహించే భారము ఎవ్వడున్నూ మోయజాలడు. చాలాసంవత్సరాలుగా భారత స్వాతంత్ర్యముకొరకు పోరాడినాము. దానిని సాధించాముకాని మన ఇష్టానుసారంగా సాధించలేదు. మనము దానిని సాధించినపద్ధతి భారతదేశానికి ఘాతకల్గించింది; మనకు ఘాతకల్గించింది. మనము పలుమారు మునిగితేలే ఉత్సవాలు అట్లా ఉంచిచూస్తే, గతసం॥ రం రోజులుగా జరిగిన దానివల్ల మనహృదయములు విషాదంతో నిండియున్నవి. కాబట్టి వకడు కోరినట్లుగా ఎప్పుడూ వ్యవహారాలుకావు.

  

అది రాష్ట్ర ప్రభుత్వంకానీ, కేంద్ర ప్రభుత్వంగానీ, దానిమంచిచెడ్డలను చెప్పడానికి ఒకటే పరీక్ష. ప్రజలను ఏమాత్రము బాగుపరచారు అని చూస్తారు. ఈబాగు ఏకొన్ని నగరాలలోనో కొన్నిమంచి భవనాలుకట్టడంగాదు; గ్రామం అభివృద్ధిచెందాలి; గ్రామ వాసులకు నిత్యకృత్యానికి కావలసిన సౌకర్యాలన్నీ అమరవలె. అదీ, ముఖ్యపరీక్ష.

  

మనము సాధించ దలుచుకున్నదేమి? దారిద్ర్యంనాశనం చేయదలచుకున్నాము. మనుష్యశక్తి సామర్థ్యాలు వ్యర్థముకాకుండా కాపాడదలుచుకున్నాము. తద్వారా ప్రతివాడికి కష్టించి సృష్టించేనేర్పుకలగాలి; దానివల్ల ఆతనిబ్రతుకుకు కావలసినవన్నీ లభ్యమై శక్తిఉన్నంతవరకు అతడు అభివృద్ధిగాంచవలె. అందుచేత ఒకడు ఏకులానికి చెందినా, మతానికి చెందినా, తనఅభివృద్ధికి తానేకర్త అనుటకు సమానమైన అవకాశము మార్గము అతనికి అందుబాటులో ఉండవలెను.

  

మన మాతృదేశం గొప్పది; శక్తికలది. మనదేశానికి స్వతంత్రంవచ్చింది. మన మిప్పుడు మనదేశాన్ని ఇతరవిధాలకూడా గొప్పదాన్ని చేయడానికి కృషిచేయాలి. గొప్పతనం ఎక్కువ ఆయుధ సామగ్రి నిలువచేయడంలో లేదు; ప్రజలు ఉత్పత్తిచేయ సమర్థులై, తృప్తికల్గి, అభివృద్ధిచెందువారై ఉండాలి. కాబట్టి భారమాత గొప్పది కావాలంటే, భారతీయప్రజల గొప్పతనం నిర్మించాలి. దానివల్ల నిర్మాణాత్మకమైన ప్రజల గొప్పకృషికి—దేశమాత మూర్తి, ఆత్మకాగలదు.

జవహరిలాల్ నెహ్రూ

# నా చిన్ననాటి ముచ్చట్లు

కే. ఎన్. కేసరి

## నాగరికపు నాటకములు.

★

### ధార్వాడ కంపెనీ నాటకములు.

అంతకు పూర్వము గతమాసమునందు వివరించిన వీధిభాగవతములు వెలసియున్న మన ఆంధ్రదేశమునకు 1890 ప్రాంతంలో ధార్వాడ నాటకకంపెనీ-యని ఉత్తరదేశమునుండి వచ్చి పలుతావుల నాటకములువేసి ప్రజాభిమానమును సంపాదించిరి. వీరు పాతపద్ధతుల నన్నింటినిమార్చి, రంగస్థళమునకును, వేషభాషలకును చాలవిధములగు మెరుగులను దెచ్చిరి. రంగస్థళమున ఆయా నాటకములందలి కథపట్టులకు తగిన రంగుతెరలను (కర్టన్స్) కట్టుచుండిరి. ఆముదపుదివిటీలకు బదులు రంగుమత్తాపులను వెలిగించుచుండిరి. కొయ్యతో చేసిన కాకిబంగారపు నగలకుబదులు గిల్టుసొమ్ములను ధరించుచుండిరి. మంచి ఉడుపులను ధరించుచుండిరి. నటన, నృత్యాదికములైన నూతనదృశ్యములను సొంపుగ చూపించుచుండిరి. ఈనాటకములు ఆంధ్రదేశమున జనులకు ఆకర్షణీయముగ నుండెను. వీరి ఇంద్రసభను జనులు చాలా మెచ్చుకొనుచుండిరి. అయితే వీరిభాష (హిందీ) వేరుగ నుండెను. మొత్తమున కీనాటకములవల్ల మన తెలుగుదేశమున నాట్యకళ క్రొత్తమార్గము పట్టినది.

### పార్సీ నాటకములు.

వీరి పిదప బొంబాయి ప్రాంతమునుండి పార్సీనాటకకంపెనీవారు మద్రాసుకువచ్చి ఇప్పుడు బర్మాషెల్ కంపెనీవారి కట్టడముండు స్థళమున పెద్దకొటాయిని దిట్టముగ పలకలతోను ఇనుపరేకులతోను కట్టి రెండు మూడు మాసములు దినదినము నాటకములు వేసేవారు. వీరి రంగస్థళపు ఏర్పాట్లు చాల రమణీయముగను ఆకర్షణీయముగను ఉండెడివి. ముఖ్యముగ వర్షముకురియుట, తుపానుకొట్టుట, సముద్రము, ఇండ్లుకూలుట, కాలుట మొదలగువాటిని చూచినప్పుడు నిజముగ అవి జరుగుచున్నట్లే కాన్పించును. రంగస్థలముమీద వారుధరించు ఉడుపులు దీపములవెలుతురులో జనుల నానందాశ్చర్యముల ముంచివైచెడివి. వారు చూపించు దర్బారు సీను లద్భుతముగ నుండెడివి. ఒక సీనునుండి

యింకొక సీను మారుటకు సూచనగా ఒక తుపాకీకాల్చెదువారు; ఆ దెబ్బకు అదరి కనుమూసి కన్ను తెరచేటంతలో - ఒక్కనిమిషమున సీను మారిపోయెడిది. ఈ నాటక సమాజమున స్త్రీలు పురుషులు కలిసియుండేవారు. ఈ సమాజమువారు చెన్నపట్నము వచ్చినపిమ్మట, రంగస్థళమున ఇచ్చట నటకుల వేషభాషలు చాలవరకు మర్యాదమార్పులను చెందినవి. నాటకములలో స్త్రీపాత్రను స్త్రీయే ధరించుటకు కూడ ఈ నాటక సభయే చాలవరకు తోడ్పడినది. అటుపిమ్మటకూడ మరికొన్ని పార్శీనాటకసమాజములవారును మద్రాసునకు వచ్చియుండిరి.

## బళ్లారి సరసవినోదినీసభ

ఈసభకు మూలపురుషుడు శ్రీమాన్ ధర్మవరము రామకృష్ణమాచార్యులు. ఆంధ్రదేశమున స్వతంత్రముగ నాటకములరచించి, తానును పాత్రవహించుచు తగువారిని తర్ఫీదుగావించి నాటకములనాడు కంపెనీలను ప్రారంభించిన ప్రముఖులు, ప్రథములు వీరే యనవచ్చును. ధార్వాడ పార్శీ నాటకకంపెనీలు మనదేశమునకు వచ్చి వెళ్లుటకు కొంచము వెనుకముందులుగా, వీధిభాగవతములు ముదురై వచననాటకములు వెలసినవి. 1884 లో గుంటూరునాటక సంఘమువారీవచననాటకము లాడుటలో ప్రసిద్ధులు అని తెలియుచున్నది. 1888 లో వీరినిచూచి మా వంగవోలువారైన ఇమ్మానేని హనుమంతరావు నాయుడుగారు రాజమహేంద్రవరమున ఏర్పరచిన హిందూనాటక సమాజమువారు 1889 లో ఆడిన తోలేటి వెంకటసుబ్బారావుగారి 'హరిశ్చంద్రనాటకము'న్నూ చిలకమర్తి లక్ష్మీనరసింహంగారి "కీచకవధ' యున్నూ ఇట్టి వచననాటకములే. ఈ వచన నాటకములలో శ్రీ పరికాశంపంతులుగారు చిన్నతనములో చంద్రమతి, ద్రౌపతి పాత్రలు ధరించుచుండిరని విందుము. శ్రీఆచార్యులవారు ఆంగ్లవిద్యాభ్యాసమొనర్చిన పట్టభద్రులు, న్యాయవాదులునైయుండిరి. ఆంగ్లనాటకములసారమును, సంస్కృతనాటకములపోబడులు నెరింగిన ప్రోడలగుట తమ స్వతంత్రనాటకములలో నానాయా ఛాయల చూపించిరి. ధార్వాడకంపెనీ, పార్శీకంపెనీలవారి దరువులు, మెట్లు మున్నగునవి అప్పటికే ఆంధ్రదేశ మందలి ప్రేక్షకుల నాకర్షించుచుండుటచే - వానికి సమమైన పాటలను తమనాటకముల చేర్చిరి. నాటకమున పాత్రధారణమును వృత్తిగాగాక వినోదముగావహించు పెద్దమనుష్యులను చేరదీసి - నాటకసమాజమును నిర్మించిరి. వీరి మేనల్లుడే విఖ్యాతిచెందిన నాట్యకళాప్రపూర్ణ రాఘవాచారిగారు. కావున వీరికి 'ఆంధ్రనాటక పితామహ' యన్న బిరుదు అమరియున్నది. అయితే నాఅభిప్రాయమున వీరు నటునికన్నా నాటక రచయితగానే ఎక్కువ ప్రసిద్ధులు. వీరి నాటకములవలన తెలుగువారి నాటకరంగమున కొకతీరు ఏర్పడి

రక్తికెక్కి శోభించినది. వీరి నాటకసమాజమువారు తరచుగ ఆరోజులలో చెన్నపురికివచ్చి తమనటనా కౌశలము చూపిరి. ఇచ్చట ధనవంతులగు వర్తకులు, ఉద్యోగస్థులు విస్తారముగా నీనాటకములు చూచిరి. శ్రీ ఆచార్యులవారు చిత్రనళీయమునందు బాహుక పాత్రనుధరించి నటించుటను నేనుచూచియున్నాను. అప్పటికే వారు వృద్ధులైయుండినందున రంగస్థళమున వారిపాత్ర అంతగా రాణించియుండలేదు. వారువ్రాసిన నాటకములు పైకి వచ్చినపిదప అంతకుపూర్వము నాటకములన్నియు మాయమైనవి.

ఈ బళ్లారిలోనే వకీలుగానుండిన శ్రీ కోలాచలం శ్రీనివాసరావు పంతులుగారు కూడ ఆకాలముననే కొన్నినాటకములు వ్రాసిరి. వీరికి నాటకలక్షణము బాగుగ తెలియును. ప్రపంచమందలి నాటకముల చరిత్ర చాలా తెలియును. వీరా విషయమునుగూర్చి యొకగొప్ప గ్రంథమును, ఆంగ్లభాషయందు వ్రాసియున్నారు. వీరువ్రాసిన నాటకములలో మేటి "విజయనగర సామ్రాజ్యపతనము". ఈ నాటకమందు పఠాణ్ రుస్తుం పాత్రధారిగా శ్రీరాఘవచారిగారి ఖ్యాతి ఆంధ్రులకు వేరుగా చెప్పనక్కరలేదు. లవకుశ మున్నగు మరికొన్నినాటకములనుకూడా వీరు రచియించియున్నారు. వీరును ఒక నాటక సమాజమునేర్పరచిరి. కాని అది ఆచార్ల వారి నాటకసమాజమంత ప్రసిద్ధిచెందలేదు. కొన్నాళ్లీ రెండుసమాజములకు బద్ధవైరముగాకూడ నుండెడిదట. శ్రీ రావుగారి కంపెనీ పేరు - "సుమనోరమసమాజము" అయియుండగా ప్రతికక్షులు దీనిని "సుమ్మనేరి సభ" అని హాస్యమాడేవారట. "సుమ్మనేరి" అంటే కన్నడములో మౌనమువహింపుము యని అర్థమట. ఆ కాలములలో ఒక్కేదేశమునగల నాటకసమాజముల కిట్టివైరము సహజ లక్షణముగా నుండెడిది.

## సు గు ణ వి లా స స భ

బళ్లారి సరసవినోదనీ సభవారి నాటకములు ప్రజారంజకములగుటజూచి చెన్నపురియందలి విద్యావంతులకును ఉత్సాహము కలిగినది. ఆ ఉత్సాహఫలితమే సుగుణ విలాససభ. ఇది 1891లో ఏర్పరుపబడినది. ప్రధమమున దీనిలో చేరినది 7 గురుసభ్యులు. ఇది కొంతకాలమునకు విక్టోరియా పబ్లిక్‌హాలులో ఉంచబడి అందే అభివృద్ధిగాంచినది. పిదప మౌంటురోడ్డులో దీనికి స్వంత భవనమేర్పడినది. ఈ సభలో అరవలు ఆంధ్రులు కూడ కలిసి సభ్యులుగనుండిరి. నా చిన్నతనమున ఈ సభలో సభ్యుడుగానుండుట గౌరవ చిహ్నముగా నుండెడిది. నేనుకూడ ఈ సభలో సభ్యుడనైతిని. ఈసభవారు ప్రధమములో ఆంగ్లాంధ్ర ద్రావిడ సంస్కృత కన్నడభాషలలో నాటకములాడుచుండిరి. తుదకు మిగిలినవి తెలుగు అరవ నాటకశాఖలు మాత్రమే. ఈసభ నాటకము లాడుటకును రుచిగల ఫలహార

ములకును పేరుపొందియుండెను. ఈరెండును మెంబర్లనాకర్షించుచుండెను. ఈసభవారు దసరావండుగను అతివైభవముగ జరుపుచుండిరి. ఆ తొమ్మిదిరోజులు సభాభవనమున సభ్యులకు విందు జరుగుచుండెను. నాటకముల నాడుచుండిరి. ఇందనేక జనరంజకమగు కార్యములనుచేయుచు సభ్యులను సంతోషపరచుచుండిరి. ఆంగ్లాంధ్ర ద్రావిడ పుస్తక భాండాగారములు కూడ ఈసభ తరఫున నేర్పడినవి. స్వంతభవనమునకు మారినపిదప ఈ సభ ఇప్పుడు ముందువలె నాటకాదులను విశేషముగ జరుపుటలేదు. ఇప్పు డీ సభ ఎక్కడున్నదియు చాలమందికి తెలియదన్న అతిశయోక్తిగాదు.

ఈ సభకు మూలపురుషులు శ్రీమాన్ వి. వి. శ్రీనివాసయ్యంగారు. వీరిని సభ్యులందరును 'ముత్తన్న'అని పిలుచుచు పితృభక్తితో గౌరవించుచుండిరి. వీరు నాటకాలంకార శాస్త్రములందు మంచి పరిచయముగల కళావేత్తలు; రసజ్ఞులు. వీరు స్వయముగ కొన్ని సాంఘికనాటకములనువ్రాసి సభవారిచే ప్రదర్శింపించుచుండిరి. వీరు కొన్నాళ్లు మద్రాసు హైకోర్టు జడ్జీపదవి వహించియుండిరి. ఆ రోజులలోను దీనిని చేయివిడువక నడిపించి వృద్ధికి తెచ్చిరి. నేడు వీరు వృద్ధులయ్యు న్యాయవాదవృత్తిని వదలుకొనక అప్పు డప్పుడు హైకోర్టునందు కన్పించుచుందురు. వీరిని దర్శించినప్పుడు భీష్మాచార్యులు మనస్సునకు వచ్చుచుందురు.

ఈ నాటకసభకు సూత్రధారులు శ్రీ దివాన్‌బహదూర్ సంబంధ మొదలియారు గారు. వీరు కొన్నాళ్లు ప్రెసిడెన్సీ మాజిస్ట్రేటు ఉద్యోగమునుకూడ నిర్వహించిరి. వీరు అరవనాటకములను వ్రాసి సభ్యులచే నాడించుచుండిరి. స్వంతముగ వేషములనువేసి సభ్యులను సంతోషపెట్టుచుండిరి. వీరు షష్టిపూర్తి గడిచినపిమ్మటకూడ ప్రహ్లాద నాటకములో బడిపిల్లవాని వేషమునుధరించి సభ్యులను నవ్వించుచుండిరి. వీరు ఆవేషమున "ఓ. న."అనే బీజాక్షరములు వీపునవ్రాయించుకొని నటించి నవ్వించుట నాకు ఇప్పటికిని జ్ఞాపకమున్నది. వీరును వృద్ధులై విశ్రాంతి తీసుకొనుచున్నారు.

ఈ సభకు అలంకారపురుషుడు గతించిన రంగవడివేలుగారు. వీరును న్యాయ వాద వృత్తియందేయుండి అకాలమరణమునకు గురియైరి. వీరికి రంగస్థలమున ఆడవలయు ననియు పాడవలయుననియు కడు కుతూహలముగా నుండెడిది. కాని పాపము వారు ఆడలేరు; పాడలేరు. అయితే కొన్నిరోజులు కష్టపడి నాట్యమును మాత్రము కొద్దిగ నేర్చుకొనిరి మౌనమును ధరించి రంగస్థలమున నృత్యమును చేయుచుండిరి. వీరు రాణి వేషమును వేసినప్పుడెల్లను సంబంధ మొదలియారుగారు రాజువేషమును వేయుచుండిరి. వీరిరువురు మంచి చెలికాండ్రు. రాణివేషమున వడివేలుగారి తీరైనపాపట, కస్తూరితిలకము, ముఖమున చిరునవ్వు నాకు ఇప్పటికిని మరుపువచ్చుటలేదు.

క్రమముగా నీసభయందు మొదట ఆంగ్లాంధ్ర ద్రావిడనాటకశాఖ లేర్పడినను చిరకాలము సాగినవి తెలుగు తమిళ శాఖలే అని వ్రాసియున్నాను. ఈ సభాసభ్యులలో అరవదేశపు తెలుగువారునుకొందరు సభ్యులై యుండిరి. వారు తెలుగునాటకముల పాత్రలధరించుచుండిరి. ఎప్పుడైనను, ఈ సభవారి తెలుగునాటకములలో బళ్లారి రాఘవాచారిగారును, నెల్లూరి వారైన కందాడై శ్రీనివాసన్ (దొరస్వామి) గారును వేషములు వేయుచుండిరి.

నేను మొదటచూచిన వీరి తెలుగునాటకము 'వరూధిని'. ఈ సభాసభ్యులలో కృష్ణస్వామిఅయ్యర్ గారను అరవవారొకరుండిరి. వరూధినిపాత్రను ఆ అయ్యర్ గారు ధరించేవారు. వీరి కంఠస్వరము కిన్నరస్వరమును బోలియుండును. వీరి పాటలను వినుటకు ఊరి పెద్దశెట్లందరును వచ్చేవారు. వరూధినిపాత్రధారులై ప్రవరాఖ్యుని ప్రథమపరిచయపు ఘట్టునందు —

"ఇంతలు కన్నులుండ తెరువెవ్వరి వేడెదు భూసురేంద్ర"

అను పద్యమును చదువుచు, అభినయమునకై కండ్లు, నోరు తెగతెరిచేవారు; రెండు చేతులను బారజాపేవారు. పెద్దన కవితామాధుర్యమునంతయు, అయ్యరుగారు సాంతముగా సాపడేవారు. వీరు ముసలివారయి పొట్టపెద్దదయ్యేవరకు స్త్రీవేషము వేయుట మానలేదు. ఈ సభవారు నెల్లూరునకువచ్చి వరూధిని నాటకమును ప్రదర్శించిరి గాని అచ్చటి తెలుగువారికి ఈ తెలుగునాటకము అంతగ రుచింపనందున, వీరిని వారు బాగుగా ఆదరింపలేదు.

### చంగాబజారు నాటకములు

మదారాసులో సుగుణవిలాస సభయేగాక మరికొన్ని నాటకకంపెనీలున్నూ వెలిసి యుండెను. ఇప్పుడవి అంతరించినవి. నా చిన్నతనములో అవి యొక వెలుగు వెలిగినవి. వానినిగూర్చి తెల్పెదను. జార్జిటౌనులో చంగాబజారు అని యొకవీధియుండెను. ఆవీధిలో నాటకముల నాడుటకు కొఠాయియొకటి వేయబడియుండెడిది. అక్కడ అప్పుడు మదారాసు అరవలు అరవనాటకములాడేవారు. నేనుచూచిన మొదటినాటకము "డంబాచారి విలాసము" అనే నాటకము. దీనిని బాల్యామణి, కోకిలాంబ అనేవేశ్యలు ముఖ్యపాత్రలుధరించి నడిపించేవారు. వీరిద్దరు అక్కచెల్లెండ్రు. వీరు భోగమువారైనను ఆకాలమున తమతోకూడ యొకపురుషుడు వేషమువేయుట కిష్టపడెడువారుకారు. అందువలన వారిలో పెద్దదియగు కోకిలాంబ పురుషవేషమును, చిన్నదియగు బాలామణి స్త్రీవేషమును ధరించేవారు. డంబాచారి విలాస నాటకమునందు అనేక శృంగార రసపూరితములగు వేషభాషలుండుటచేత పురజనులు రంగస్థలమంతయు నిండియుండెడువారు.

ఈ బాలామణి మంచిరూపసి. సంగీతవిద్వాంసురాలు. డంబాచారితో సరససల్లాపము లాడుట నటించునప్పుడు సందర్భానుసారముగ మంచి తెలుగుజావళీలనుపాడి ప్రేక్షకులను ఉద్రేకులుగ జేయుచుండెడిది.

మరియు ఈమె తారాశశాంకమునకూడ చాకచక్యముతో నటించుచుండెను. ముఖ్యముగ ఈనాటకములో తార చంద్రునకు తలఅంటు ఘట్టము విలక్షణమైనది. అప్పుడే తారచంద్రునందు తనకుగల అనురాగమును మొదట వెల్లడిచేయునది. ఆ సీను అరవములో "ఎణ్ణైతేకిరసీను" (నూనెఅంటుసీను) అని మద్రాసున ప్రసిద్ధి. ఆనాటకము రోజున ఎవరినోటబట్టిన అదేమాట. తార చంద్రునకు తలంటుచున్నట్లు చిత్రమును అచ్చొత్తించి ఊరంతయు పంచిపెట్టేవారు. దీనిని చూచుటకు జనులు తండోప తండములుగా వచ్చేవారు. ఈ ఊరిలో గొప్పగొప్పవారు సహితము ఈ సీనుచూచుటకు హాజరయ్యేవారు.

గో విం ద సా మి రా వు కం పె నీ

వీరి పిమ్మట గోవిందసామిరావు అను బ్రాహ్మణుడు పోలీసునౌకరిని చేసి వదులుకొని నాటకరంగమున ప్రవేశించెను. ఈయన భారీమనిషి, బుర్రమీసములు, దృఢకాయమునుగల అందగాడు. వీరినాటకములకు మంచి ఆదరణ కలిగెను. వీరి నాటకములలో మంచి పేరుగాంచినది రామదాసునాటకము. ఈ నాటకములో ముఖ్యపాత్రయగు నవాబు వేషమును గోవిందసామిరావుగారే ధరించేవారు. ఆ కాలమున ఈ నాటకములో వీరుచూపిన వేషభాషలు ఇంకను నాకు మరుపురాలేదు. ఉరుదుభాషను చక్కగ ఉచ్చరింపగలిగినవారా నవాబువేషమునకు చక్కగా అతికినట్లుండేవారు. చిన్నబాలురను రామలక్ష్మణుల పాత్రలువహింప తర్ఫీదునిప్పించి రంగస్థలమున ప్రదర్శించిరి. ఆ బాలురు కడు శ్రావ్యముగ పాడేవారు. ఆ రోజులలో పురుషుడే బూబువేషమువేసేవాడు. ఖోజాస్త్రీల వేషములు ధరించినవారు రంగస్థలమున నాట్యముచేసేవారు.

మ రొ క్క అ ర వ నా ట క ము

మరియొక్క అరవనాటకములో, నేను చూచినదృశ్యమునుకూడ ఇక్కడవ్రాయక తప్పదు. హరిశ్చంద్రనాటకములో—ఇరువురు కాటికాపరుల వేషమును ధరించుకొని రాగా ఎవరివేషము బాగున్నదో దానిని జడ్జీలునిర్ణయించి బహుమతి యొసంగవలయునని యేర్పాటాయెను. ఈ విషయమును కరపత్రములద్వారా ఊరంతయు వెల్లడిపరచిరి. ఆ దినమున టిక్కట్లుదొరుకుట కష్టమాయెను. అమిపాఙ్జలుచేయ పోలీసులుకూడ రావలసి వచ్చెను.

కొంతకాలమునకు తెరతీసిరి. స్మశానదృశ్యము కనుపడెను. అక్కడ కండ్లుతుడుచు కుంటూ చంద్రమతి సకలాలంకారభూషణ భూషితురాలై పెద్ద పెండ్లికూతురివలె అగుపడెను. ఆమె కిరువంకల పందెమునువేసుకొన్న కాటికాపరివేషధారులు ఇరువురును నిలవబడియుండిరి. వారు మంచి సరిగెఉడుపులను, వెలగల ఆభరణములను ధరించుకొని, వెండికఱ్ఱలను చేతపట్టుకొనియుండిరి. అప్పుడు అక్కడ ఏర్పాటైన జడ్జీలుఇరువురును వా రిరువురిని ముందుకురమ్మని వార్లను ఎగాదిగా చూచి, మెడలోఅధికముగా బంగారుహార ములు ధరించిన వేషధారికి బహుమతి నొసంగిరి. ఇదీ ఆకాలమున మద్రాసులో అరవ వారి హరిశ్చంద్రనాటక విశేషము.

## అమెచ్యూర్స్ నాటక సమాజం, నెల్లూరు

చెన్నపట్నమునకు పిమ్మట నాకు నెల్లూరితో ఎక్కువ పరిచయముకలదని వెనుక వ్రాసియున్నాను. ఈ పరిచయములో వారి నాటకముల పరిచయమునుకలదు. తెలుగు దేశమున నాటకములపిచ్చి ఏర్పడిన రోజులలో-బళ్లారి, చిత్తూరు, గుంటూరు, రాజ మహేంద్రవరము, చెన్నపట్నములలో నాటకసమాజము లేర్పడినట్లే నెల్లూరునందును ఒక నాటకసమాజ మేర్పడినది. ఆ నాటి, నాటకసమాజములలో - విద్యావంతులు ఉద్యోగులు చేరి, వినోదముకొరకు నాటకములాడేవారు. ఇట్టి నాటకసమాజములను "అమెచ్యూర్సనాటకసంఘము" లనేవారు. అట్లు నెల్లూరులోఏర్పడిన అమెచ్యూర్సనాటక సమాజమువారు 1890ప్రాంతములలోనే నాటకములాడజొచ్చిరి. ముఖ్యముగా వీరు బళ్లారి రామకృష్ణమాచార్యులవారి నాటకము లాడేవారట. ఇట్లుండగా 1897 లో శ్రీ వేదము వేంకట్రాయశాస్త్రిగారు ప్రతాపరుద్రీయ నాటకమును వ్రాసిరి. దాని నాడవలయునని కుతూహలమై వీరు యథాశక్తినేర్చి క్లుప్తపరచి ఒక్కరోజున ప్రదర్శించిరి. కాని ఆ అపూర్వనాటకమును వీరుచక్కగా ప్రదర్శింపజాలక రసాభాసము గావించిరట. అయితే, చిత్రనళీయాదినాటకములను ప్రశస్తముగ నాడనేర్చిన వారి కది యవమానకరమై-రోషమున తిరిగి దీనిని రెండురాత్రిళ్లు అనూలాగ్రము ప్రదర్శించి కీర్తినడయదలచిరి. వారిలోనే కొం దరు శ్రీ శాస్త్రిగారి శిక్షణపొందినగాని దీనిని కీర్తికరముగ ప్రదర్శింపజాలమని పట్టుబట్టిరి. మొత్తమునకు ఈఇరుకక్షులకు వాదోపవాదములు వృద్ధియైనవి. ఈ తగువులు శాస్త్రిగారి చెవికి నెక్కినవి. తమశిక్షణలేక ఆ నాటకమును వీ రాడి తమ నాటకమున కవమానము

తెత్తురని శ్రీ శాస్త్రులవారి కనిపించెను. తన యనుమతిలేక ఆడరాదని శ్రీ శాస్త్రిగారు అమెచ్యూర్సునకు నోటీసిచ్చి-నిలిపివేయించిరి. దీనితో కొందరు నిరసనభావముగల్గి ఇది పఠనయోగ్యమేగాని ప్రదర్శనయోగ్యముకాదని ప్రచారమారంభించిరి. శ్రీ శాస్త్రిగారికి తగువారిని శిక్షించి ఒద్దికలతీర్చి దీనినే ప్రదర్శింపజేసి కీర్తిపొందవలయునని పట్టుదల యేర్పడెను. ఆ సంగతినెరింగి ఇందునుండి చీలిపోయినవారు "ఆంధ్రభాషాభిమాని సమాజము" అనుపేరట నేర్పడిరి. దాని చరిత్ర వేరుగ వ్రాయుదును.

అయితే ఆ ప్రాత అమెచ్యూర్సువారు అట్లే విడువక నాటకము లాడజొచ్చిరి. 1906 లో వీరి నాటకపు పాక తగులబడిపోయినది. అప్పటికి ఇందుండు పెద్దలకు కేవలము నాటకములతో తృప్తిపొందక పట్టణమున శుపయుక్తమగు ఇతర కార్యక్రమములను చేయవలయునని తోచినది. ఆ కారణమున 1906 లోనే ఇది నెల్లూరి ప్రోగ్రెసివ్ యూనియన్‌గా పరిణమించినది. దీనికే నెల్లూరి వర్ధమానసమాజము అని తెలుగున పేరు. వీరు తిక్కనపేరట నొక పఠనమందిరమును, పుస్తకభాండాగారమును ఏర్పరచిరి. ఆంధ్రదేశమున నిట్టి సంస్థలు బహుకొలదియే గలవు. అయినను వీరు నాటకము లాడుట మానలేదు. ఇది ప్రోగ్రెసివ్ యూనియన్ అయిన కొంతకాలమునకు నాకు దీనితో సంబంధముకలిగినది ఆ సంబంధమును ఇదివరలోనే వ్రాసియుంటిని. ఇప్పుడు నాకు పరిచయముగల వారినాటకములగూర్చియే వ్రాయదలచితిని. ఇప్పటికే ఈ వ్యాసము దీర్ఘమైనందున నా కత్యంత మభిమానపాత్రమైన నెల్లూరి నాటకసమాజములను గూర్చియు, నెల్లూరి నటులనుగూర్చియు ప్రత్యేక వ్యాసములను వ్రాసెదను.






బొప్పాయి:- ఈ చెట్టు సర్వసామాన్యముగ ఇండ్ల ఆవరణములలో కానుపించును. త్వరలో ఎదిగి ఫలములిచ్చు పెరటిచెట్టు. సుమతిచెప్పినట్లు పెరటిలో యెంతదివ్యమైన ఓషధులున్ననూ సామాన్యముగ లెఖ్ఖచేయరు. అయితే కాలపరిస్థితుల ననుసరించి అల్లము, కొతిమెర, మెంతి, కరివేపాకు, మునగ, తులసి, నల్లేరు, అడ్డసరము, మంచి కలబంద మొదలగువాటిని పెంచుట అవసరము.

బొప్పాయి . పాపాయిలకు వచ్చు లివరుజబ్బులకు దివ్యౌషధము.

| | |
|---|---|
| కాయనుంచి వచ్చుపాలు | 1 డ్రాము. |
| పంచదార | 1 డ్రాము. |

కలిపి యెండనిచ్చి పొడిచేసి మూడు భాగములుగజేసి దినమునకు మూడుపర్యాయములిచ్చిన జీర్ణశక్తిహెచ్చి, కడుపు ఉబ్బరముపోయి, పాండువర్ణముతగ్గి, శిశువు కారణములేని ఏడ్పుమాని హాయిగనుండును.

మొండితామరవ్యాధులకు:-బొప్పాయి కాయమీది చెక్కుతీసి పాలు యింకకముందే తామరగల స్థలముల రుద్దిన మానును. అయితే ముతకగుడ్డతో బాగా చర్మరంధ్రములు శుభ్రమొనర్చి రాచిన తప్పక గుణమిచ్చును.

కాయయొక్క రసమును ఎండబెట్టిన పొడియగును. ఆపొడిని "పాపెయిన్" అని అందురు.

సమస్త అజీర్ణ సంకటములకు:-

| | |
|---|---|
| పాపెయిన్ పొడి | 10 గ్రెయిన్లు |
| రేవలచిన్ని | 5 ,, |
| దాచినచెక్క లేక లవంగపట్ట చూర్ణము | 5 ,, |

భోజనమునకుపూర్వము యిచ్చిన విరేచన సాధనమై పొట్టనొప్పి, మరల మరల విరేచనమునకు వెళ్లవలయుననే శ్రమ లేకుండజేయును.

పసిబిడ్డలు వారలకు కలుగు ఆకలితెలియకనే పదార్థ విచక్షణ లేకయే రుచిఅయినవి మితముతప్పి తినెదరు. అట్టివారి జీర్ణకోశము చెడి, మందాగ్ని ఏర్పడి కడుపులో గుండ్రని క్రిములుజనించి పిల్లల ముఖవర్చస్సు నానాటికి క్షీణించి బలహీనులగుదురు. అట్టివారలకు

| | |
|---|---|
| కాయయొక్క పాలు | ½ ఔన్సు. |
| మంచితేనె | ½ ఔన్సు |
| వేడినీళ్లు | 2 ఔన్సులు. |

చేర్చి ప్రత్యేకముగాగాని, ½ ఔన్సు ఆముదముచేర్చిగాని యిచ్చిన సుఖవిరేచనమయి, క్రిమిసంహారమై హాయిగనుండును.

ఎఱ్ఱతుత్తిచెట్టు:—శరీర సంరక్షణార్థము ప్రకృతియందు కొన్ని ఓషధులు, మూలికలు, వాటి వాటిపేర్లకు తగినట్లె గుణములిచ్చును. పేరుకూడా గాంభీర్యముగనుండును. ఎఱ్ఱతుత్తిచెట్టు లేక పిశాచ గంజాయిచెట్టు అని అందురు. సామాన్యముగ ఉష్ణప్రదేశములందు అస్సాము, మధ్యపరగణాలు మొదలగుస్థలముల పెరుగును. దానిఆకులు, మొదలు, వేళ్ల బెరడు మందులకు ఉపయోగించును. వేళ్లవలుపులో బంక, జిగురు మైనములకు పరిసమానమయిన పదార్థము, భస్మసంబంధమగు పదార్థములు యుండును.

ఆకులు, మొదలు, వేళ్లవలుపు, మృదుత్వము కలుగచేసి శాంతినిచ్చు గుణములు గలవై యుండును.

ఆకులతో కషాయము, వేళ్లవలుపులతో వుండలు చేయవచ్చును.

ఉపయోగములు:— మేహవ్యాధులు, ప్రమేహములు, గనేరియాయను సెగవ్యాధులు దీని ఆకులతో కషాయముచేసి చల్లారనిచ్చి పూటకు ½ ఔన్సు చొప్పున రోజుకు రెండు పర్యాయములు పుచ్చుకొనిన శాంతించును.

వేళ్లపైనుండు వలుపుతీసి మెత్తగనూరి శనగగింజ ప్రమాణము మాత్రలుచేసి రోజుకు రెండుమాత్రలచొప్పున కొబ్బరికాయనీళ్లతో సేవించిన రక్తగుల్మము అస్థిస్రావము, తెలుపు, ఎరుపు, కుసుమవ్యాధులు, మంటలు నెమ్మదించును.

స్త్రీలకు బహిష్టుసమయములో వకమారు యీ మాత్రలుయిచ్చిన గ్రహదోషములు, సంతానములేకుంటుట, గొడ్రాలుగనుండుట, మూఢగర్భము, అయోమయపు అవస్థలు పోవును. నూతనముగ సంసారమునకువచ్చిన యిల్లాండ్రు, గర్భవతులగుదురు. సర్వసామాన్యముగ బహిష్టు ప్రారంభమునుండి వారమురోజులు విడువక యీ మాత్రలు యివ్వవచ్చును. నొప్పికూడ యుండినయెడల బహిష్టగుటకు ముందు రెండురోజులనుండి వాడవచ్చును.





# మొక్కజొన్న

గతమాస సంచికలో గోధుమధాన్యముయొక్క ప్రాశస్త్యము ఆహారమునకును, ఔషధములకును ఉపయోగించుచున్న విషయములు వివరించితిమి. దీనితో సరిపోలిన మొక్కజొన్న, జొన్న, సొజ్జ, రాగి (తమిద) అనునవికూడ నుపయోగించును.

మొక్కజొన్న:—సర్వసామాన్యముగ గోధుమపైరగు మెరక నల్లభూములయందే పైరగును. మరియు విశాలమైదానముగల భూసంపన్నులు వారికి చేరువనున్న గృహావరణములలోనే పైరుపెట్టుదురు. బహుత్వరలోయెదిగి ఉపయోగకరమగును. ఇటీపైర్లు సకాలమున పెట్టుటచేతనె "కరువు" కాటకములు సామాన్యముగ కానుపించవు. పంట వంటలయందు మనముచూపు అలక్ష్యభావమే కాటకములను, క్షుద్బాధలను పెంపొందింపజేసినది. మొక్కజొన్న ముఖ్యమయినఆహారము. పుష్టినిచ్చును. పిల్లలు సహితము మొక్కజొన్న కంకులను కుంపటి నిప్పులలోగాని, విడి నిప్పులలోగాని పొర్లించి, వెచ్చచేసి వేడి వేడిగ పాలతో గూడినవాటిని భుజింతురు, పండ్లతో గీరి, చేతులతో వలిచి తిందురు. రుచికరముగానుండును.

దీనియందు ఒక ప్రత్యేకవిషయము మాత్ర మున్నది:—దీర్ఘకాలముంచుకొనుటకు, విత్తనములకుగాను దాచుకొనుటకు తగినంత జాగరూకులయి యుండవలెను. ఎందుకనిన మధురపదార్థ మిందు నుమిడియున్నది, అందుచే పాకకళ గుర్తెరిగిన గృహిణులు, తదితరులు - గుగ్గిళ్లుగ వండవచ్చును. ఆకుకూరలలో అనుములు, శెనగలు వాడినవిధముననే మొక్కజొన్న గింజలను వేసుకొనవచ్చును.

వడలు:—మొక్కజొన్నగింజలను నానబోసి-మినప పప్పును కూడచేర్చి - రుబ్బి ఆ కలిపిన పిండిని మామూలుగ చేసుకొనునట్టి వడలమాదిరిగనే చేసుకొనవచ్చును. కొందరు వీటినే చిల్లిపొడిచి గారెలని కూడా అందురు.రుచి, యిష్టముల ననుసరించి ఉల్లిపాయలు, పచ్చిమిరపకాయలు, అల్లం, కర్వేపాకు, కొత్తిమెరాకు ఉపయోగించుకొనవచ్చును.

దోసె:—మొక్కజొన్నగింజలను నీళ్లుజల్లుచూ రోటిలోపోసి దంచి, ఆ వచ్చిన గండునూకల ఆర బోసి, ఆరిన పిదప తిరగలిలో మెత్తని పిండిగావిసరి, అవసరమయితే మినపపిండినికూడకల్పి దోసెలు, అట్లు, పోసుకొని భుజించవచ్చును.

ఇడ్లీ:—దోసెకు తయారుచేసుకొనునట్టి గండురవనుతీసి నానబెట్టి, మిరియాలు, జీలకర్రచేర్చి మరు నాడు ఇడ్లీ పాత్రలోనో, అవిరిపెనములోనోపోసి ఇడ్లి తయారుచేసుకొనవచ్చును. తగునట్లు అన్నిటిలోను ఉప్పును మాత్రము వేయుట మరువకూడదు - ఉడకబెట్టినను, రుబ్బినను పదార్థము తినుటకు తయారయి యుండునప్పుడెల్ల ఉప్పువేసిననే తినుట కుపకరించునుగాని లేనియెడల రుచిలేనిదైనట్లుతోచును. పంటకములు ఉపహారములు, ఫలహారములేగాక అన్నముగకూడ వండుకొని తిందురు.

అరపడిగాని అవసరమును తగినన్నిగాని నీళ్లు సలసలకాగిన తర్వాత రెండు అరాకుల మొక్కజొన్న రవనుపోసి, పైనీటిని వార్చవలయును. సామాన్యముగ నిప్పులసెగపైన వుంచి 10 నిమిషములుకంటె మరికొంత యెక్కువకాలము వుంచవచ్చునుగాని దింపుట మరచిపోరాదు.

మరియొక సామాన్యపద్ధతి:—బియ్యము అన్నమువండినట్లే మొక్కజొన్ననూకను నీళ్లలోపోసి పొయ్యిమీదనుంచి కలియబెట్టుచూ ఉడికినదని తెలుసుకొని వార్చి మరల కుదిలించి సన్నని సెగపయిన కొంచెముసేపువుంచి దించవలయును.

ఇందుకు ముక్కలతోచేరిన సాంబారుగాని పప్పుపులుసుగాని వుండిన మంచిచేరికనిచ్చును.

మొక్కజొన్న కండెలు - కంకులచివర భాగమున-పట్టుదార్లములవలె సన్నని పీచు ఏర్పడియుండును. దానితో కొన్ని ఔషధములు తయారు చేయవచ్చును.

మూత్రసంబంధమయిన జబ్బులకు, మంటతోకూడిగాని, వేడిగగాని, కొంచెము కొంచెముగావచ్చు మూత్రవ్యాధులకు, అడ్డుపడినట్లుండి వచ్చు మూత్రవ్యాధులకు ఉపయోగించును. ఒక కంకికియుండు పీచును వేడినీళ్లలోవేసి కషాయముగకాచి చల్లారినపిదప వడియగట్టి సుమారు తడవకు 1 ఔన్సుచొప్పున రోజునకు రెండుపర్యాయములు పుచ్చుకొనవలయును. మలమూత్ర విసర్జనలచేయును.

మొక్కజొన్న ఏవిధముగ భుజించినను మంచి మజ్జిగ తగినన్ని పుచ్చుకొంటే సులభముగా జీర్ణమగును.

ప్రఖ్యాతిగాంచిన ప్రశస్తమైన
మెహతావారి విశేష ఔషధములు
1. సుందరి ఎలిగ్జిర్:—సమస్త ఋతుదోషములను పోగొట్టును, గర్భాశయరోగ అనుపమ నివారిణి.
2. ఫాస్ఫరస్ ఆయిల్:—బాధ నివారణకు సాటిలేని తైలము.
3. మస్తానాపిల్సు:—సాధారణబలహీనత, కీళ్లనొప్పులు, జ్వరములన్నిటికి అమోఘముగాపనిచేయును.
4. ద్రాక్షాసవము:—(బంగారము, మకరధ్వజము కలిసినది) రక్తమును శుద్ధిపరచునటువంటి, అజీర్ణము రూపు మాపునటువంటి బలవర్ధకౌషధము.
కెమిస్టులందరివద్ద దొరకును.
తయారుచేయువారు:—K. S. MEHTA & CO.
250, China Bazar, Madras 1

కుష్ఠు ★ బొల్లి అన్నిరకముల కుష్ఠునకు, బొల్లి వ్యాధులకు ఇతర చర్మవ్యాధులకు గ్యారంటీగా పనిచేయుచున్నవి
మా ఔషధరాజములే!! కేటలాగులు, యోగ్యతాపత్రములు ఉచితము!
రెడ్డి & కో.. (రిజిష్టర్డ) H. O. గోపాలపురం (వయా) తణుకు, తూ. గోదావరిజిల్లా
బ్రాంచ్ ఆఫీసులు.
బెజవాడ గాంధినగరం
వాల్తేరు R. S. ★
కటక్ బక్సీబజార్ ★
సికింద్రాబాద్ 3560 కింగ్స్వే
నెల్లూరు కాపువీధి ★
బరంపురం పెద్దబజారు ★
ఫజిల్నగర్ గోరక్పూర్



# బ్రతుకు తెరువు



జెల్లీ వడియగట్టు విధానము:- ఫ్లానల్ గుడ్డ కన్న గట్టిదిగానున్న తెల్లనిగుడ్డను తీసికొని వేడినీళ్లలో ముంచి దానిలోని నీరంతయు పిండుము. పిండినతర్వాత దానిని నాలుగు గూటములు అమర్చబడియున్న కొయ్య చట్టమునకు, మధ్య కొద్దిగా వదలుండునట్లు దారముతో గుడ్డను బిగింపవలయును. పిమ్మట జెల్లీ దానిలోనికి పోయవలయును. అది బొట్టు బొట్టుగా దిగును. దానిని దింపుటకై చేతిని ఉపయోగించరాదు. కదిలింపనురాదు. ఇట్లు చేసిన పరిశుభ్రమయిన ద్రవము దిగును.

ఈజాం, జెల్లీలు తయారయినవెంటనే వీనిని వక వెడల్పాటి, పరిశుభ్రమైనట్టి, పళ్లెములో పోసియుంచుము. కొంతసేపు ఆరనిచ్చి పిమ్మట వానిని సీసాలో పోసి కార్కులు పెట్టిభద్రముచేయుము.

గ్లాసు, పింగాణి జాడీలలోనే దీనిని బాగుగాకడిగి ఎండలో ఆరనిచ్చి ఎట్టివిధమగు మురికిలేకుండునట్లు తుడిచి, గరిటతో యీద్రవములను జాడీలలోపోసి గట్టిగా మూతలను బిగించి వాటిపై పేరుగలచీట్లు అంటించి చల్లనిప్రదేశములో నుంచవలయును. అట్లు చేసిననిల్వయుండుటకు వీలై వ్యాపారములకు అనుకూలముగ నుండును.

అన్నివిధములగు పండ్లతో జాం, జెల్లీలను తయారుచేయవచ్చును. వాటిలో సులభమై అందరికి అన్నివేళలలభ్యమగు వాటిని తయారొనర్చువిధానములు.

ఆపిలుపండ్లు 2 పౌనులు. చక్కెర 2 పౌనులు.

పాత్రను యీభాగములకు తగినట్లు ఉపయోగించుము.

4 కిచ్చిలి లేక నారింజపండ్లపై తొండినతోలు

ఎండబెట్టి పొడిచేసిన అల్లం ½ ఔన్సు: లవంగాలపొడి ¼ ఔన్సు:నీరు 10 ఔన్సులు

మొదట 10 ఔన్సులనీటిలో కరిగినంత చక్కెరపోసికలిపి దానిలో పైన వుదహరించిన భాగముల పొడులు బాగుగాకలిపి నీరంతటిని 6 ఔన్సులుగ కాచి ఎనామిల్ పాత్రలోనుంచుము. దాని సన్నని నిప్పుసెగపై యుంచి పండ్లతోళ్లను చిన్న చిన్న ముక్కలుగాజేసి కలిపి నిప్పుపై ఉడుకుచున్న పాత్రలోవేయుము. ఇట్లు ఒక గంట కాలము కాచుము. ఇట్లు కాచగా తయారయినట్టి పదార్థమే జెల్లీయనబడును

రాబోవు సంచికలో లెమన్ జెల్లీగూర్చివివరింపబడును.

—★—

# ఇంటిపనులలో మెళకువలు

## పత్ని అయిన పిదప



గృహస్థజీవన సామ్రాజ్యమునకు పట్టమహిషిరూపమున సింహాసనము నధిష్ఠించగనే స్త్రీకి గట్టి బాధ్యత కలుగుచున్నది. ఆటపాటలలోను, మందహాసములలోను తల్లిదండ్రులవద్ద కాలముగడపిన స్త్రీ అత్తవారియింటికి గృహరాణియై వచ్చినమీదట స్త్రీకి అదియంతయు ఒక విలక్షణమైన నూతనవ్యవస్థ గల ప్రపంచమువలె దృగ్గోచరమగును. తన బాల్యదృష్టితోను, తనస్వేచ్ఛాదృక్కులోడను (స్త్రీ) పోల్చి చూచినట్లైన అత్తవారిఇంట స్త్రీయొక్క జీవనారంభము నైరాశ్యము, దుఃఖవంతమగును. స్త్రీ దాంపత్య జీవితమున అడుగిడుతరి ఈవిషయములను సరిగా గుర్తించినచో సతీపతుల జీవనము స్వర్గతుల్యమగును.

### పతిగృహములో

పతిగృహమున ప్రవేశించగనే మొట్టమొదట స్త్రీ ఆయింటివాతావరణమును బాగుగా గుర్తించుటకు ప్రయత్నించవలెను. ఆయింటిలో వ్యాపకములైన పద్ధతులననుసరించి స్త్రీ అన్నిపనులను చేయవలెను. ఆయింట ప్రచురితములగు ఆచారవ్యవహారములకు వ్యతిరేకముగా ఏపనియు చేయరాదు. అనగ తానుచేయు ప్రతిపనియు పరులకు కంటగింపుగ నుండరాదు. అత్తమామలకు, అందరియెదుట పతితో ప్రసంగించుట, నవ్వుట ఇష్టములేకున్నను, మరియు బయటసంచరించుట లేక బజారుకువెళ్ళుట, సినిమాచూచుట మొదలగునవి ఇష్టముకాకున్నను అవిఅన్నియు మానుట మిక్కిలిఉచితము. ఎందువల్లననగా క్రమక్రమముగ అత్తగారు స్వయముగనే తనపుత్రునియొక్కయు కోడలియొక్కయు కోర్కెలనన్నింటిని సమకూర్చుటకు సిద్ధమగును. ఒకవేళ పతిఎప్పుడైనా ఇంటివారికి వ్యతిరేకముగ ఏదియైనా పనిచేయుటకు నిన్ను ఆదేశించినచో దీనిచే మనఇరువురునకు చెడ్డపేరువచ్చునని ప్రేమపూర్వకముగా తనపతికి నివేదించవలెను. ఇట్లు ప్రవర్తించిన గృహమునందెన్నటికిని కలహమంకురింపదు. వ్యష్టిజీవనమునకన్న సమష్టిజీవనమే సుఖప్రదము, లాభదాయకముగదా! అట్టి సమష్టిజీవితమునకు ఇట్టి సత్ప్రవర్తన మిక్కిలి ఆవశ్యకము.

### అత్తకోడలు

అత్త—అనగా పతియింట పెద్దసభ్యులలోనొకరు, అనగా ఆయింటికి పూర్వపు గృహరాజ్ఞి. ఆమెసంపర్కములోనే కోడలు ఎల్లప్పుడును నుండవలెను. ఈ అత్తయే భర్తగారితల్లిఐఉన్నది. ఈమెయే భర్తనుపెంచి పెద్దవాడినిచేసినది. తత్ప్రతిఫలముగ ఆమె తనకోడలు, పుత్రుడు తనఆజ్ఞకు బద్ధులై మెలగుచుండ గోరుచున్నది. నేడు ప్రతిచోట అత్త, కోడండ్రమధ్య నేదియో ఒక అలక కన్పించుచున్నది. తన్మూలమున ఎప్పుడును కలహవంతులగుచున్నారు. స్త్రీ కొంచెము బుద్ధిచాకచక్యమున ప్రవర్తించిన యింటిలో ప్రేమసామ్రాజ్యము నెలకొనును. అత్త సంతోషవంతురాలైన ఇంటిలో శాంతివిరాజిల్లును.

అత్త మర్యాదా గౌరవములను ఆకలిగొనియుండును. తదభిలషితములగు ఆ మర్యాదా గౌరవములభించిన ఆమె అతి శీఘ్రముగ ప్రసన్నురాలగును. నీవు ఎచ్చటికైన వెళ్ళగోరినచో అత్తగారిని మధురముగ ఇట్లడుగుము - అత్తగారూ! నేడు మనము సినిమాకు వెళ్ళెదమురండి. బయటకు ఎచ్చటకైనను పోవలెయునన్న అత్తగారిని వెంటతీసుకొనివెళ్ళుటకు ప్రస్తావింపవలెను. ఏమైనా వస్త్రములు లేక వస్తువులు తీసుకొన గోరినచో అత్తగారితో కలసివెళ్ళి సంప్రదించి కొనుటమంచిది. ఈ ప్రవర్తనాఫలితంగా నీయందు అత్త ప్రసన్నురాలగును. ఆమెకునీపైన ప్రేమగాఢమగును. దీనికి వ్యతిరేకముగ అత్తగారినడగకుండ లేక అత్త కంటపడకుండ, ఏపని ఐనా చేసినచో అట్టిపనిని ఆమె తనకు అవమానముగ తలచును. కోడలు తనను లక్ష్యపెట్టుటలేదని ఎంచును. భర్తఉద్యోగియై నెలసరిజీతమును తెచ్చి నీయందలి అనురాగముచే నీకిచ్చుచో పుచ్చుకొనినవెంటనే అత్తగారికిమ్ము. ఇదిచూచిన అత్తగారిహృదయమున పట్టరాని సంతోషముగలుగును, కొన్నిరోజులైనపిమ్మట ఆమె నీయందలి ప్రేమాతిశయమునఅమ్మా! ఇక నీవే జాగ్రత్తపరచుకొనుము, అనిచెప్పి పూర్వపు తన "రాణీపదవి" నీకధీనముచేయును.

## కుటుంబ సభ్యుల మధ్య

అత్త తన మానమర్యాదలను ఏవిధముగ నభిలషించునో అదే విధముగ తన భర్తయొక్క (అనగా మామయొక్క) మానమర్యాదలను చూడగోరును. ఈవిషయమును నీవుదృష్టియందుంచుకొనవలెను, అత్తకు తనకుమార్తెలు (నీఆడబిడ్డలు) మరియు తనపుత్రులు చాల ప్రియముగనుందురు. నీవు నీప్రియసంతానమువలె వారినిచూచుచు రక్షించుచుండవలెను. ఎప్పుడును తనకన్నవారిఇంటి గొప్పతనమును ప్రసంగించి అత్తవారు తమకంటె తక్కువవారని ఎన్నడును, ఎచ్చటను నుడువరాదు. ఇంటిలోఎవరితోడను అధికముగ ప్రస్తావనచేయకుము. ఎప్పుడును శీలవతిగ సంచరించుచుండుము. నీవు నీపతిదృష్టినుండి ఎప్పుడును పతితవు కాకుము; ఒక్కపర్యాయము పతిదృష్టిలో పతితురాలవైన అందరిదృష్టిలోను పతితురాలవగుదువు.

## అత్తవారి ఇల్లే నీ ఇల్లు

అత్తవారిఇంట నీపై నేమైనా చాడీవచ్చినచో నీ ఇంటగాని, పొరుగింటగాని ఎవరితోడను రెండవ వారితో దానిని చర్చించకుము. అత్తవారి ఇల్లే నీ ఇల్లు. నీ జీవితమునంతయు అందే గడపవలెను. ఇంటి రహస్యములు ఎవరికిని చెప్పకుండుట బుద్ధిమంతుల లక్షణము. ఇంటి విషయములను దాచియుంచుటలోనే నీ హృదయవైశాల్యము, నీ గొప్పతనము ప్రకటమగును. నీ యింటివారితోగాని లేక ఇతరులతోగాని నీ అత్తవారినిగూర్చి చాడీలుచెప్పిన అది నీ అత్తవారికిని, నీకును శ్రేయోదాయకముకాదు. అట్లు చెప్పిన నీకు గొప్పతనమురాకుండుట యటుండ నిన్ను తెలివితక్కువదానినిగాగణింతురు. "ఇంటిగుట్టు లంకచేటు".

## ఆదర్శ స్త్రీ లక్షణములు

తియ్యనిమాట:—గృహస్థ జీవనము సఫలమగుటలో తియ్యనిమాట గొప్పమహత్త్వము గలదగును. మృదుమధురవాక్కు జీవితములోకలిగెడి గొప్పదుఃఖమును, క్రోధమును, సంతాపమును శాంతిపరచును. నీవు నీ వాక్కులో మాధుర్యమును మిళితముచేసి ప్రవర్తించిన సంసారములోని చిన్నపెద్ద కష్టములను సులభముగ నతిక్రమింపవచ్చును. ఇంతియేగాక పతిహృదయమునుకూడ సర్వదా వశపరచుకొనవచ్చును.

సౌందర్యము:—ప్రతిమానవ హృదయమున సౌందర్యమునందు ఆసక్తికలిగియుండును. ఇందువలన ప్రతివనితయు తనవేషభూషలను శృంగారము వైపునకు తీసుకొని పోవుటలో నప్రమత్తురాలై యుండవలెను. స్త్రీయాకర్షణకు లోటుకలగనీయరాదు. పరిశుభ్రమైన సుందరమైన వస్త్రములను కళాపద్ధతితో ధరించుటచేత, మరియు ఉచితమైన అలంకరణచేత సౌందర్యము పెంపొందుచున్నది. ఎప్పుడును పారిశుద్ధ్యరహితముగా నుండకుము. కేశములు విరజిమ్ముకొని ఉండరాదు. అత్తరు, సెంటు, పౌడరు, స్నో, తైలము, క్రీము మొదలైనవి సౌందర్యాభివృద్ధికి సహాయకములగుచున్నవి. కాన సౌందర్యమును స్థిరరూపమున నుంచవలయు నన్నలేక సౌందర్యమును ఎల్లప్పుడు వృద్ధిపొందింపవలెనన్న శరీరోగ్యమును కాపాడుకొనుటయే ముఖ్యమైన ఉపాయము. శరీరము ఆరోగ్యమును, ఎంతకలిగి యుండునో అంత సౌందర్యమును కలిగియుండును. నీవు నీ సౌందర్యమును గట్టిపరచుకొన్నచో ఎల్లప్పుడు పతిప్రియవై ఉండెదవు.

పాతివ్రత్యము:—పాతివ్రత్యమే స్త్రీ సంపదలలో ఉత్కృష్టమైనది. పతికినీ మధురమైన మాటలతోడను, నిజమైన సేవచేతను 'ఎల్లప్పుడు నీదానినే' అను విశ్వాసమును కలిగించుము. చెడువస్తువులయందు అభిలాష, మధిరాసవము, చెడ్డవారితో సాంగత్యము, పరపురుషునితో కలియుట, సంభాషించుట, నవ్వుట, పరపురుషునిచెంత యెక్కువకాలముండుట, వ్యర్థమగు పుస్తకములను చదువుట, పనికిమాలిన సినిమాలను చూచుట, ఇతరులఇంట నివసించుట, నిండుయౌవనములో ఇతరులవద్దనుండుట, పతితోవేరై ఇటునటు సంచరించుట ఇవి అన్నియు స్త్రీలకు గొప్పతప్పిదములు. మరియు నివి స్త్రీ పతన మార్గమునకు త్రోవతీయును. ప్రతిస్త్రీయు ఈ దోషముల బారిపడకుండ మెలకువతో ప్రవర్తింపవలెను.

## గృహలక్ష్మి

ప్రతిఇంటిలోను కొంతకాలము గడచినపిదప స్త్రీ గృహజీవనములో తన జీవితమును లీనముచేసి 'గృహలక్ష్మి'యగుచున్నది. గృహలక్ష్మి ఐన పిమ్మట ప్రతిస్త్రీయు తప్పక శిష్టాచారములను కలిగియుండవలెను. ప్రాతఃకాలముననే భర్తలేచుటకు పూర్వమేలేచి కుటుంబపెద్దలందరకు ఒకపరి నమస్కరింపవలెను. ఇంటినౌకరు లేనప్పుడు తాను స్వయముగ పాచిఊడ్చుట, కళ్ళాపిచల్లుట మొదలగు పనులలో అత్తవారికి సహాయపడవలెను. అత్తవారిఇంటి ఆచారవ్యవహారములను పూర్తిగ గుర్తెరిగినమీదట ఇంటి ఏర్పాట్లన్నింటిని కైవశము చేసుకొనుము. మర్యాదానుసారముగ లేచికూర్చుండుము. గౌరవపూర్వకముగ వినయముతో సంభాషించుము. అందరితో ప్రేమపూర్వకముగ కలసిమెలసి ఉండుము. ఇట్లున్న నిరాటంకమై, నీ జీవిత మమృతమయమగును.

మూలము: శ్రీమతి ఇంద్రాణీదేవి జయస్వాల్. అనువాదము: కాకర్ల సరోజినీదేవి





# మిలన్

శ్రీమతి రాజామణిగారు

రాధాకాంతముఖర్జీ యొక్క పరిశ్రమవలన బ్రహ్మ మహావిద్యాలయము తెరచినప్పటినుండి కాన్పూరు బాలబాలికలందరు దానిలో చదువుటకు స్వర్గీయానందము పొందుచుండిరి. ఆ బాలబాలికల ప్రేమకూడా చిత్రమే. దానిలో స్వార్థము అనేమాటలేదు. ఒకరిపట్లఒకరికి నిర్మలమైన ప్రేమ.

ఆ విద్యాలయములో రామానందుడు ఒకవిద్యార్థి. దేవధర్ పండితుని పుత్రిక మోహిని, రామూ ఒకే క్లాసులో చదువుతూ ఉండేవారు. వాళ్ల వాళ్ల క్లాసులో రామానంద ఎప్పుడూ ఫస్టు. మోహిని సెకండు. మోహిని తండ్రి లక్షాధికారి. రామానందుడు బీదవాడు. కొడుకు సూక్ష్మబుద్ధిచూసి తండ్రి చాలా సంతోషించేవాడు. కష్టపడిఎలగో రామూని చదివిస్తూ వుండేవాడు.

మూడుసంవత్సరాలు గడిచాయి. అది జూన్ నెల అలహాబాదు కాలేజీ ప్రవేశఫలితాలకు ఎదురు చూస్తూన్నారు. రామానందుడు, మోహినికూడా పరీక్ష ఇచ్చారు.

♦ ♦ ♦

"మోహినీ! కులసాగానున్నావా? ఇప్పుడెందుకు కష్టపడి వచ్చావు."

"రామూ! నీకు మంచిశుభవార్త చెప్పడానికివచ్చాను. నాకునువ్వు ఏమిటి ఇస్తావో ముందుచెప్తే నేను నీకు శుభవార్తచెప్తాను."

"మోహినీ! నీవంటి లక్ష్మీస్వరూపికి ఇవ్వడానికి ఈ బీదవానిదగ్గిర ఏమిఉంటుంది? ఈశరీరము ఈ మనస్సుకూడా నీదే."

మోహిని టెలిగ్రాం వకటి రామానందునిచేతికిచ్చింది. "దీనిచదువు".
రామానంద ఇలా చదివాడు.

Allahabad.
Ramanand and Mohini stood first and second in Matriculation. My best congratulations
Radha Krishna

టెలిగ్రాం చదివి రామానంద ఇలాఅన్నాడు. "నీకు నా అభివందనములు"
మోహినీ నవ్వుతూఅంది. "నీకుకూడ".
ఆ తర్వాత వారు ఎంతసేపో కాలేజీ చదువు గురించి ముచ్చటించారు.

♦ ♦ ♦

"తానొకటి తలచిన దైవమొకటి తలచును".

రామానంద మోహిని కాలేజీలో కూడాకూడా చదవడానికి సంతోషపడుతున్నారు. కాని ఈలోగా రామానంద తండ్రికి బెంగాలువెళ్లమని ఆర్డరువచ్చింది. రామానందుని విడిచివెళ్లడానికి తండ్రి ఇష్టపడలేదు.

రామానంద ఈవార్త మోహినికి చెప్పగానే ఆమె ఆశ్చర్యపోయింది. రామానంద తండ్రి కలకత్తాలో పనిలోచేరాడు. అక్కడకు వెళ్లినతర్వాత అతని అదృష్టముకూడా పండింది. 150 రూ|| జీతం అయినది. రావుసాహేబు బిరుదుకూడా దొరికింది. రామానంద అక్కడ కూడా బెంగాలీ విద్యార్థులకన్న మేటి అయి

చదువుతూఉండేవాడు. రామానందకు మోహినీకి ఉత్తరప్రత్యుత్తరాలు జరుగుతున్నాయి. ఒకనాడు రామానంద తండ్రి శివానందుడు రామానందకు ఒక ఉత్తరం ఇస్తూ ఇలా అన్నాడు. నాయనా! ఇందులో ఎలావ్రాసి ఉందో అలా నీవు చేయాలి.

"కొన్ని ముఖ్యకారణాలవల్ల నేను మోహినిరామానంద ఉత్తరప్రత్యుత్తరాలను ఆటంకపరుస్తున్నాను. సోదర భావంగల రామానందతో ఉత్తరాలు జరుపడం బాగాలేదని ముందు ముందు మోహినికి ఉత్తరాలు రాయకుండా చేయమని నేను మిమ్ములను ప్రార్థిస్తున్నాను." రామానంద ఇది చదివి నిశ్చేష్టుడైపోయాడు, అలా కుర్చీలో కూలబడి పోయాడు.

ఈ ఘటనజరిగి 4 సం|| అయింది. కలకత్తాకాలేజీ రిజల్ట్సు తెలిసాయి. అందరికన్నా ముందునెంబరు రామానంద చతుర్వేదిది. బి. ఎ. అవగానే I C S. చదవడానికి గవర్నమెంటు స్కాలరుషిప్పు దొరికింది. కాని రామానంద ఓడమీద కాలుపెట్టి సంఘపు కట్టుబాట్లను భంగపరచడానికి శివానంద ఇష్టపడలేదు. కాని తనఅధికారి తనఎదుట తనపుత్రుని గొప్పతనము పొగడటం, విదేశమునుండిరాగానే కొడుక్కి కలక్టరు పని అవడం, ఇవన్నీ ఆలోచించి మళ్లా విదేశానికి పంపడానికీ నిశ్చయించాడు.

ఇంగ్లండుచేరగానే రామానంద తనదేశం హీనస్థితి, ఇంగ్లడుదేశం గొప్పస్థితి భేదం తెల్సుకున్నాడు. మాతృభాష ఉన్నతిలేకుండా దేశం బాగుపడదని తెల్సుకున్నాడు. రామానందకు రెండే పనులు. ఒకటి I. C. S. పరీక్ష పుస్తకాలు చదవడం. రెండు హిందీలో వ్యాసాలు వ్రాయడం. కొన్ని రోజులలో అతను 25 వ్యాసాలు వ్రాశాడు. ఒక రోజున అవన్నీ కట్టకట్టి హిందీలో అన్నిటికంటె గొప్పదైన "వైజయంతీ" పత్రికా సంపాదకుడికి పంపించాడు. ఈ వ్యాసాలన్నీ క్రమంగా "భ్రమర్" అనే మారుపేరుతో వైజయంతీలో ప్రచురించారు. అప్పటినుండి వేలకొలగి "వైజయంతీ"కి చందాదారులు అయ్యారు. ఇంటింటా ఎంతో శ్రద్ధతో "భ్రమర్" వ్యాసాలు చదువతూ ఉండేవారు.

కొన్నిరోజులయాక రామానంద చిన్ననాటిక వ్రాశాడు. అది చాలా బాగాఉండెను, ప్రతిమాట లోను ప్రేమ ఉట్టిపడుతూఉంది. మే నెల "వైజయంతీ"లో అది ప్రచురించారు: జూన్ నెల "వైజయంతీ"లో దాని గురించి విమర్శన పారంభించారు. ఆ విమర్శన చేసినవారుకూడా అందులో తమ పేరు ఇవ్వలేదు. కమల అని ఆఖరున వ్రాసిఉండెను. జూన్ నెల "వైజయంతీ" లండనుచేరిన తర్వాత రామానంద ఆ విమర్శచూశాడు. ఇంతచక్కగా విమర్శించేవారు ఉన్నారా? అని ఒకసారి ఆనందించాడు. అప్పటినుండి "వైజయంతీ" కొరకు చాలా ఉత్సాహముతో ఎదురుచూస్తూ ఉండేవాడు.

లండనునుంచి సెక్రెటరీ ఆఫ్ స్టేట్ టెలిగ్రాం వచ్చింది. I. C. S పరీక్షలోగా గొప్పస్థానం పొంద డానికి ఆర్డరు వచ్చింది. రామానంద I. C. S. పరీక్ష అవగానే అలహాబాదులో నియమింపబడ్డాడు. శివానందు ఆనందానికి హద్దులేదు.

"వైజయంతీ" పత్రికా సంపాదకుడు భుజంగభూషణ భట్టాచార్యుడు. చాలా యోగ్యుడు. "వైజయంతీ" ప్రయాగనుండి ప్రకటింపబడుతుంది. భట్టాచార్య ఆఫీసు ఊరికి బయట ఒక తోటలోఉంది. అది ఏకాంత స్థలము. అక్కడే కూర్చుని ఆయన సాహిత్యాలోచనచేస్తూ ఉంటాడు. ఎదురుగుండా ఒక గది ఉంది. ఆయన ఈ జీఛైరులోకూర్చుని నాటిదినపత్రిక చూస్తున్నాడు. ద్వారముతెరుచుకుని నౌఖరు విజిటింగుకార్డు ఇచ్చాడు. కార్డుచూడగానే భట్టాచార్య బైటకువెళ్లాడు. కొంతసేపయాక రామానందుని చేయిపట్టుకుని లోపలకువచ్చాడు.

భట్టాచార్య అన్నాడు.—"నేడు చాలా సుదినము." రామానంద—ధన్యవాదము. ఎన్నో రోజులనుంచి ఇలా వద్దామని అనుకున్నాను. కాని పనివలన వీలులేకపోయింది,

భట్టా—తమ వ్యాసములు అందులో మరీగొప్పదైన తమ నాటిక "మిలన్" వలన మా పత్రిక చాలా గొప్పదయింది.

రామా—నా నాటికను విమర్శ మళ్లా ఏమైనా రాలేదా?

భట్టా—"అవును వచ్చింది." అని బల్ల డ్రాయరులోనించి కొన్ని కాగితాలు తీసిఇచ్చాడు.

కాగితాలుఇస్తూ భట్టాచార్య ఇలా అన్నాడు. "ఇది చూడండి వీరువ్రాసిన ఈ కొత్తవ్యాసము వచ్చింది. వైజయంతీ మొదటి సంపుటమున ఇదే ప్రథమవ్యాసము".

రామానంద వ్యాసము చదువుతున్నాడు. భట్టాచార్య బైటకువెళ్లి కొన్నిపండ్లుతెమ్మని మాలీతో చెప్పేడు. రామానంద రెండువాక్యాలు చదివేడో లేదోగాని అప్రయత్నంగా అతని నోటినుండి ఈమాటలు వచ్చాయి. ఆ! "ఇది నిజమా! కలా! చాలా ఆశ్చర్యము." భట్టాచార్య గదిలోకివచ్చాడు, అతనినిచూచి రామానంద ఇలా అన్నాడు. "అయ్యా! తమరు ఏదైతే రహస్యంగాఉంచి నేను మాటిమాటికి అడిగినా గాని చెప్పలేదో అది దానంతట అదే బైటపడిపోయినది.

భట్టా—ఏమి వ్యాసకర్త అసలుపేరు మీకు తెలిసెనా?

రామా—"అవును చూడండి" అని మూడవపేజీ భట్టాచార్యునిముందు పెట్టెను. అందులో ఒక ఫోటోఉంది. దానిక్రింద ఈ విధముగా వ్రాసిఉంది.

పితృసమానులైన భట్టాచార్యుల సేవయందు భక్తిపూర్వకముగా సమర్పించుకొన్న; మోహినీబాల M. S. C. ప్రిన్సిపాల్ హిందూగర్ల్స్ కాలేజీ బెనారస్, ఈ ఫోటో మీదే భట్టాచార్యుని చేతిలో ఈక్రిందివిధముగా వ్రాయబడివుంది, మిలన్ నాటిక విమర్శకురాలు "కమల". రామానందుని సంతోషానికి మేరలేదు. మోహిని వియోగకారణంవల్లనే "అతను" "మిలన్" నాటిక వ్రాసెను.

భట్టా—అయితే మీరు శ్రీమతి మోహిని బాలను ఎరుగుదురా? రామానంద దీనికి జవాబు చెపుతుండగానే మరల తలుపు తెరవబడింది. నౌఖరు మరియొక కార్డు తీసుకునివచ్చాడు. కార్డుచూడగానే భట్టాచార్యుడు తెల్లపోయాడు. "ఇప్పుడే వస్తాను క్షమించండి" అని అతను బైటికివెళ్లేడు. కొంత సేపయిన తర్వాత మోహిని, భట్టాచార్య గదిలోకి రావడం రామానంద చూచాడు. మోహిని M. S. C. గౌను వేసుకునిఉంది. చూడగానే రామానందుడు పోల్చుకున్నాడు. కాని మోహినిని పరీక్షించడానికని తన మొఖానికి అడ్డుగా పత్రిక పెట్టుకుని చదువుతున్నట్టు నటిస్తున్నాడు. మోహిని భట్టాచార్యునితో మాట్లాడుతూఉంది.

మో—నన్ను క్షమించండి. నేను మొన్నసాయంత్రమే ఇక్కడికి వచ్చాను. కాని ఇంతకుముందే మీ దర్శనము చేయలేకపోయినాను.

భట్టా—మీరు వస్తున్నట్టు కబురుచేయలేదేమి?

మో—ఈ వారంలో ఇక్కడికి రావలసి ఉంటుందని నాకే తెలియదు. తండ్రిగారి ఆస్థివిషయములో సంప్రతించుటకు ఇక్కడి గొప్ప లాయర్లవద్దకు వచ్చాను.

భట్టా—సరే, తెలిసింది.

మో—ఎన్నో నెలలనుండి "వైజయంతీ" లో "భ్రమర్" అనే పేరుతో వ్యాసాలు ముద్రించుట లేదేమి? ఇటువంటి వ్యాసకర్త హిందీప్రపంచములో మరొకడులేడు. తమకు తన అసలుపేరు తెలుపకుండా ఉన్నందుకు చాలావిచారముగాఉంది. ఈ మాటలు రామానందుని శరీరములో విద్యుచ్ఛక్తి ప్రవహించి నట్టయింది.

భట్టా—తమవంటి విమర్శకులుకూడా హిందీప్రపంచములోలేరు.

మోహి—ధన్యవాదము. నేను హిందీజగత్తుకు ఒకక్షుద్ర సేవకురాలను.

భట్టాచార్య ఈ సమయములోనే వీరిద్దరనూ తెలియపర్చడం మంచిది అనుకున్నాడు. తమరు "భ్రమర్"ని కలిసికొన గోరుచున్నారా? వారుకూడా ప్రస్తుతం ప్రయాగలోనే ఉన్నారు. తప్పకుండా చూడండి.

మో—ప్రయాగలో వారు ఎక్కడ ఉన్నారు? చెప్పండి. భట్టాచార్య వారిద్దరిమధ్యకూవచ్చి మోహినితో అన్నాడు. జాయింట్ మేజిస్ట్రేటు పండితరామానంద చతుర్వేది I. C. S. మారుపేరు "భ్రమర్"తో నేను మీకు పరిచయము చేస్తున్నాను. వారేవీరు. మళ్లీ రామానందతో అన్నాడు. నేను మీకు తమ విమర్శకురాలు మోహినిబాలతో పరిచయము చేస్తున్నాను.

ఈ మాటలు పూర్తికాకుండానే మోహిని రామానంద కాళ్లపైపడింది. రామానంద వెంటనే ప్రేమతో లేవనెత్తాడు. భట్టాచార్య పళ్లు తేవడానికని బైటకు వెళ్లిపోయాడు.

ఒకవారంరోజులయిన తర్వాత అలహాబాదు దినపత్రికలో ఈ క్రింది విధముగా ముద్రించబడెను.

మిష్టర్ రామానంద వివాహము. మోహినీబాలతో నిన్న చాలా హడావిడిగా జరిగింది. హైకోర్టు ప్రధానోద్యోగులందరూ వివాహమునకు హాజరయిరి. నవదంపతులు చిరంజీవులై దేశకళ్యాణమునకు పాటుపడవలెనని మేము కోరుచున్నాము.

మోహినితండ్రి ఎన్నో వేల ఆస్తివదిలి చనిపోయాడు. దానికంతకూ అధికారిణి మోహిని. ఆ ఆస్తి కన్న గొప్పదైన ఒక ఉత్తరము మోహినికి తండ్రి చనిపోయిన తర్వాత పెట్టెలో దొరికింది.

మోహినీ!

నేను ఈ నిస్సారమైన ప్రపంచమునుండి సెలవుపుచ్చుకున్న తర్వాతనే ఈ ఉత్తరం చూడగలుగుతావు. నీవు రామానందకు ఉత్తరాలు వ్రాయవద్దని నేను ఆజ్ఞాపించితినని నీవు చాలావిచారించివుంటావు. కాని అలా ఆజ్ఞాపించినందుననే నీవిద్య, రామానందవిద్య పూర్తిఅయినవి. ఇప్పుడు నీవు రామానందుని వివాహము చేసుకుని గృహస్థాశ్రమంలో ప్రవేశించమని చెప్పుచున్నాను. భగవంతుడు నా కోరికలను నెరవేర్చుగాక!

నీ శ్రేయోభిలాష తండ్రి
దేవధర్


పాత్రుడుగారి
**బాలసంజీవిని (Regd)**
పిల్లల లివర్ అండ్ స్ప్లీన్ వ్యాధులను నివారించును.
**డాక్టరు పిల్లా పాపయ్య పాత్రుడు అండ్ బ్రదర్స్,**
11, దక్షిణ మాడవీధి, మైలాపూరు, మదరాసు.

కుంభకోణము బ్రాంచి :
1. సారంగపాణి కోవిల, తూర్పువీధి.

తిరుచినాపల్లి బ్రాంచి :
15 పుగళియపిళ్లెవీధి, తెప్పకుళం. P. O.

అన్ని మందుల షాపులలోను దొరకును.




విద్వాన్ బులుసు సీతారామశాస్త్రిగారు

కలదు మేవాడుసీమ సంగ్రామసింహు
డధిపుడతని పాలనానంతరమున
జ్యేష్ఠసుతు లిర్వురును రాజ్యమేలి స్వల్ప
కాలమందున బితరుల గలసినారు.

నాటికి దృతీయ పుత్రుడైనట్టి యుదయ
సింహు డైదేండ్లప్రాయంపు జిఱుతవాడు
వంశక్రమమున దాదియై వరలియుండి
యెన్నికం గన్న 'పన్నా' భరించుచుండె.

ఉదయసింహుడు బాలుడై యుండుకతన
నతనిపేరున వనవీరుడనెడి రాచ
దాసిపుత్రకు డాధిపత్యమువహించి
పాలనమొనర్పగా నేరుపాటు జరిగె.

అర్హతయెలేని తనదు రాజ్యమ్మురాక
కలరియుండక యాదుష్టుడయ్యది స్థిర
మగుట కొఱకు నుపాయము లరయుచుండె
రాజ్యమందాస మనమున ప్రబలుకొనగ.

రాజసుతునకు మరణసంప్రాప్తిలేక
తనదు నభిలాష నెరవేరదని తలంచి
పైకి ననుమానమే తోపనీక యతడు
సత్ప్రవర్తనా నటనము సలుపుచుండె.

రాజపుత్రుని నెటులైన బ్రాణహీను
జేసి యాదోష మితరుల జేర్చి యపుడ
తోడి సరదార్ల సంమతితోడ దాను
రాజ్యమేలంగ మదిని నిర్ణయము చేసె.

అతని పరిసరవర్తి నాపితుడొకండు
ప్రథిత ప్రభుభక్తి భరిత నిర్మలహృదయుడు
దుష్టవనవీరు చిత్తవృత్తుల నెటులనో
వివిధ యుక్తులచే గనిపెట్టుచుండె.

చక్కని ప్రశాంతమైన నిశాసమయము
నందు రాజకుమారుని నతనితోడ
సమవయస్కుని స్వకుమారు సంతసమున
నిద్రపోగొట్టి 'పన్నా' వినిర్మలముగ
కుట్టువని చూచుకొనుచున గూరుచుండె.

పూర్వకథితుడు నాపిత గుణయుతుండు
సంభ్రమంబున జనుదేర చని యెదుటకు
"నేల సంభ్రమమిపుడు నీకింత" యనుచు
హృదయమాందోళనము జెంద పృచ్ఛచేసె.

అందుపై నాపితుడు "ఘాతయగుచునుండె
రాజపుత్రున కిక ముహూర్తమ్ములోన
మరణమొందింప వనవీరు డరుగుదెంచు
నిచటి" కనుచును వినిపించె గృపణతమెయి.

ఆతని పల్కులమ్ములు హృదంతరమందున గాడి "యెంతలో
ఘాతఘటిల్లె నామదిని గాంచిన భీతి నిజమ్మె యయ్యో నీ
పాతక కృత్యమింకెటుల బాయగజేయుట" యంచు జింతతో
నాతత రాజభక్తి హృదయమ్మున నిండగ నామె యిట్లనున్.

(సశేషము)

# ఉపనిషత్తత్వము.



శ్రీమతి సరస్వతీ చెన్నకేశవన్ గారు ఎం. ఏ.

భరతఖండమునందు, తత్వవిచారము, చాల పురాతనమైనదనియు, దానికి ఒక ప్రత్యేకయుగము ఏర్పరచి చెప్పుట చాల కష్టతరమనియు, తాత్విక, వైజ్ఞానిక, చారిత్రకకారులు చెప్పుచున్నారు. క్రీస్తుశకమునకు పూర్వము 2000 సంవత్సరములప్పుడే ఋగ్వేదము ప్రాచీనార్యుల అనుభవము నందుండెనని వదంతికలదు. ఇటువంటి వేదములు, హిందూతత్వ, మత, మూలములైనటువంటివి నాలుగు. ఇవియే, ఋగ్, యజుర్, సామ, అధర్వణ వేదములు. ఇంత ప్రాచీనములైన వేదముల అంత్య పరనములే, "ఉపనిషత్తు" లను పేరుతోనున్నవి. ఈ "ఉపనిషత్తు" లే మన భారతీయ విజ్ఞానమునకును, నాగరికతకును, మతమునకును కూడా పునాది. కనుక, వీటిని సాకల్యంగా తెలుసుకొనుట, భారతీయుడను పేరుగల ప్రతిమనుష్యునకును అత్యావశ్యకము. భారతీయులకే కాదు, పరదేశీయులకుకూడా చదివి, అవలంబించవలసినటువంటి భావౌన్నత్యము వీటియందున్నది. ఈ "ఉపనిషత్తు" లనే "వేదాంత" మనియు "వేదసారము", "బ్రహ్మవిద్య" అనియు, చాల పేర్లతో వ్యవహరించుచుందురు.

వేదములన్నిటిలోను, యజ్ఞయాగాదులకును, విధులకును, నిత్యకర్మలకును, ముఖ్యస్థాన మీయబడియున్నది. ప్రతిదినము, మనుష్యుడు, ఏకర్మలనుజేసిన, మోక్షసుఖము బడయగలడో, ఏయాగములను జేసిన, దేహానంతరము స్వర్గసౌఖ్యము అనుభవించగలడో, వాటినే ఇందు వివరింపబడియున్నది. అనగా ఇహలోకమున చేయవలసిన క్రియలన్నియు, పరలోక సుఖముకొరకేనని వేదవిధులు.

అదియుకాక ఈ విధులను పరీక్షచేసి చూచినయెడల, అవి, ధనవంతులే చేయదగిన కార్యములు అని తోచక తప్పదు. యజ్ఞపశువు, ఇంకామిగత పరికరములన్నియు కూడా, ధనమున్నవారికే సులభసాధ్యములుకాని, సర్వసామాన్యులకు కాదు. ఎల్లప్పుడు కర్మనేచేయుచు, దాని ఫలితముపైననే లక్ష్యముంచుటవలన, క్రమేణా, ఆ కర్మల అర్థమును సూచ్యభావమును మరచిపోవుచుండిరి. ఇటువంటి పరిస్థితులకు ఎదురుతిరిగి ఒక్క కర్మానుష్ఠానముననే మోక్షము సాధ్యముకాదనియు జ్ఞానముకూడా అవశ్యమనియు చింతింప దొడగిరి. దానిఫలితమే "ఉపనిషత్తులు." కనుకనే ఇవి వేదముల అంత్యభాగములుగ పరిగణింపబడుచు, వేదాంతమను పేరబరగుచున్నవి.

"ఉపనిషత్తు" అను పదమునకు ప్రతిపదార్థము "భక్తితో దగ్గరగా కూర్చుండుట". ఆరోజుల్లో, ఈ తత్వవిచారము శిష్యులను దగ్గరగా కూర్చుండబెట్టుకొని రహస్యముగా భోధించుచుండిరట. అందులోను దీక్షబూని పాత్రులైనవారికే చెప్పుచుండిరట. కనుకనే ఈ తత్వవిచారమునకు ఉపనిషత్తే సార్థకనామమైనది.

ఈ ఉపనిషత్తులన్నింటిలోను, కొన్ని ముఖ్యాంశములున్నవి. ఇవన్నియు రెండుభావాలను బట్టి విభజింపవచ్చును. 1. జ్ఞానపరమైనవి. 2. వైరాగ్యపరమైనవి. ఈ రెండూకూడా పరమార్థిక జీవితమునకు రెండు రెక్కలవంటివి. ఇందులో ఏదిలేకపోయినా జీవి కడతేరలేదు. ఒక వ్యక్తి జీవితమునందు పలువిధములైన అంశాలుంటాయి. కష్టము, సుఖము, సంతోషము, దుఃఖము; ఇటువంటి అర్థముకాని ద్వంద్వాలు ఎన్నో సంఘటనాల్లో కలుగుతూవుంటాయి. అదియుగాక, ఒకవ్యక్తికి సంతోషమిచ్చే వస్తువు, మరొకరికి దుఃఖము కలిగిస్తుంది. ఇటువంటి భేదభావాలు ఒకటే వస్తువు నందున్నదంటే, అది కారణంలేక కాదు. ఈ కారణాన్వేషణమే జ్ఞానము. "ఏది సత్యమైన వస్తువు ?" "ఏది భేదాభేదములచేత బాధింపబడదు ?" ఈ జిజ్ఞాసాఫలితమే జ్ఞానము. ఈ వస్తువు "బ్రహ్మ" మనియు, "ఆత్మ" అనియు వర్ణింప

బడియున్నది. "ఆత్మ" అనగా తోచునది రెండువిషయములు. మొదట, "తాను" అన్నప్పుడు, అది ఇతర బాహ్యప్రపంచ భేదవిశేషమనియు, రెండవది, అది ఈ శరీరావయవ భిన్నమనియు, ఈ ఆత్మను వర్ణింపలేము. ఎందుకనగా, వర్ణనచేయుటకు, వర్ణించువస్తువు భేదవస్తువుఅయితేకాని వర్ణింపలేము. ఆత్మ తన్నుతానే భేదవస్తువుగా జేసికొని వర్ణించిన, అది భేదాభేదములకు గురియయి, తనఏకత్వమును కోలుపోవుచున్నది. ఈ సత్యవస్తువే, సత్తు, చిత్తు, ఆనందస్వరూపమనిన్నీ, దానిని అంతముగల మనుష్యజ్ఞానముతో తెలిసికొన లేమనిన్ని చెప్పబడియున్నది.

మన నవ్య పంథాలప్రకారము, ఇటువంటి తెలిసికోలేని వస్తువునిగురించి చెప్పబట్టి, ఈఉపనిషత్తులు ఉపయోగములేనట్టివి అని తోచకమానదు. అయినా, తెలుసుకొనునట్టి "తాను" తెలిసికోబడునటువంటి ఆ "బ్రహ్మము" ఒకటేవస్తువు, అభేద్యము కాబట్టి ఈప్రశ్నలకే అవకాశములేదని ఉపనిషత్తుల వాదన.

ఈ సత్యవస్తువును, జ్ఞానవిషయముగా తెలుసుకొనలేకపోయినను, అది అనుభవించగల వస్తువు. ఈ బ్రహ్మ సాక్షాత్కారమే జ్ఞానమనికూడా చెప్పబడియున్నది.

ఏఉపనిషత్తు చదివినను, వైరాగ్యమునకు ముఖ్యస్థానమీయబడి యున్నదని తోచకమానదు. కానీ ఈ వైరాగ్యము, సన్యాసముకాదు. రాగవిసర్జనమే, వైరాగ్యముకాని లోకవిసర్జనముకాదు. సంసారమందుండియే, తామరాకుపై నీటిబొట్టువలె, అంటీ, అంటక, వారివారి ధర్మములను, రాగవిరాగములు, స్నేహద్వేషములు లేక నిర్వర్తించుచూ, ఎల్లప్పుడూ, మెలగుటయే ఉపనిషత్ చింతన. దీనినే భగద్గీత యందు నిష్కామకర్మగా, వివరింబడియున్నది. కానీ ఒక చిన్న సంశయం. ఈల్లాంటి వైరాగ్యము సంసారమునందు మునిగితేలుచున్నవారికి ఏవిధముగా సాధ్యమవును? ఈ లోకమున వున్నంతవరకు ఎటువంటి సన్యాసికికానీ, నాది అన్నభావము పోదుకదా? అదియుకాక మానసికశాస్త్రప్రకారము, చరమలక్ష్యములేని పనులు లేవని ఉన్నదికదా, అంటే దానికిబదులు ఉపనిషత్తులే చెప్పుచున్నవి. సర్వము బ్రహ్మము అని తోచినతర్వాత, 'నాది, నీది' అను భేదమునకు చోటులేదుకదా! సకలము స్వార్థమే అయిన తల్లిబిడ్డల సంబంధముకూడా స్వార్థమేనా? స్వార్థములేనిపనులు ఎన్నిజరుగుట మనము చూడడంలేదు. కాబట్టి, తానేసర్వము అని తలంచుట అసాధ్యముకాదు.

ఇదియే ఉపనిషత్ సారము. ఇటువంటి భావములకు ఆటపట్టయిన ఉపనిషత్తులే తరువాత వెలువడిన నైతిక, సాంఘిక మతసూత్రములకు ఆధారము. ఆస్తిక. నాస్తిక భావములన్నియు కూడా ఉపనిషత్తులనే తమమూలముగా ఎన్నుకొనుచున్నవి. వివిధ తత్వములను బోధించు శంకర, రామానజ, మాధ్వాచార్యులుకూడా, ఈ ఉపనిషత్తులనే అంగీకరించి జోహారు లొనర్పుచున్నారు. పాశ్చాత్యదేశ విజ్ఞాని (Schopenhauer) అను అతడు, ఉపనిషత్తులలోని భావములే, సర్వోన్నతము లైనవనిన్నీ, దానికిమించిన జ్ఞానము లేదనిన్నీ వక్కాణించియున్నాడు. అటువంటి జ్ఞానపు పారంపర్యలో పుట్టిన మనభారతీయులలో చాలమందికి ఈ విషయము అగమ్యగోచరము అంటే హేయమైన విషయము. ఇప్పట్లోనైనా, ఈలోటుతీర్చుటకు ప్రయత్నములు సలుపవలెననియే, నా కోరిక.

# సామెతలు

183 దాగబోయితలారి యింట్లో దాగినట్లు.
184 సముద్రము నీఁదవచ్చునుగాని సంసారము నీఁదరాదు.
185 వ్రతము చెడినను సుఖము దక్కవలెను.
186 వ్రాసిత రాజ్యమేలవలెననియుండిన గ్రహచారము గాడిదలమేపవలెనని యున్నది.
187 శనివారపువాన శనివారమే విడుచును.
188 కత్తిమీఁద సాము కానివానికైనా తగదు.
189 కోటివిద్యలు కూటికొఱకే.
190 కూడుగుడ్డ అడుగకుండిన బిడ్డనుసాకినట్లు సాకుతానన్నాడట.
191 కోడలు కొడుకును కంటానంటే వద్దనే అత్తగారున్నారా?
192 కుమ్మరి కొకయేడు గుదియ కొక పెట్టు.
193 ఇంటికన్న గుడియే భద్రము.
194 అత్తఏలిన కోడలు చిత్తపట్టిన వరిచేనులాగేను.
195 కొండనుత్రవ్వి ఎలుకను పట్టడమా?
196 కురూపీ ఏమి చేస్తున్నావనిన, సురూపాలన్నీ లెక్కపెట్టుతున్నా నన్నాఁడట.
197 కూలికివచ్చి పాలికి మాట్లాడినట్లు.
198 కూరుచుండి పండుకొనవలయును.
199 కలిగిన వారికందఱును చుట్టములే.
200 కథకు కాళ్ళులేవు; ముంతకు చెవులులేవు.
201 ఎలుకపైకోపమునయింటికిచిచ్చుపెట్టుకొన్నట్లు.
202 ఇటునూయి, అటుగోయి.
203 ఎక్కితే గుఱ్ఱపురౌతు; దిగితే కాలిబంటు.
204 ఓరుగాలిలో దీపమువెలిగించి దేవుడా నీ మాహాత్మ్యమన్నట్లు.
205 కడియనగనోరుదెఱచి కల్లిమనగనోరుమూసినట్లు.
206 ఇంటిదీపమని ముద్దుపెట్టుకొనిన మూతి మీసములు కాలకయుండునే?
207 అరచేతుకన్న కఱువనేరదు.
208 అమ్మ గృహప్రవేశమయ్యేసరికి అయ్య శ్మశానప్రవేశమయ్యాఁడు.
209 ఉప్పుతిన్నవాఁడు నీరుత్రాగును.
210 ఊరుండే ఉప్పుఅమ్మకొని బ్రతుకవచ్చును.
211 ఎందు కేడ్చెదవు బాలుఁడా అనగ రెల్లుండి మావాళ్లు కొట్టుదు రన్నాఁడట.
212 పెదవిదాటిన పెన్నదాటును.
213 బావిలోతుచూడవగును కానిమనసులోతుచూడలేము.
214 ఓర్చిన ఓరుగల్లే పట్టణమవును.
215 తప్పు ఒప్పు దైవమెరుగును; పప్పుకూడు బాపడెరుగును.
216 తాబట్టిన కుందేటికి మూడేకాళ్లు.
217 దివిటీముందర దీపము.
218 నీరు పల్లమెరుగు; నిజము దేవుఁడెరుగు.
219 ప్రాణముపోయినను మానము దక్కించుకొనవలెను.
220 గాడిద కేమితెలుసు గంధపొడివాసన.
221 క్షేత్రమెరిగి విత్తనము, పాత్రమెరిగి దానము.
222 సాక్షికాళ్లు పట్టుకొనడముకన్న వాదికాళ్లుపట్టుకొనవచ్చును.
223 రూకలేనివాఁడు పోకచేయలేఁడు.
224 రాజుభార్య మేడయెక్కిన, కుమ్మరవాని కోడలు గుడిసె యెక్కినదట.
225 ముంజేతికంకణమున కద్దముకావలెనా?
226 శంకులోపోసిన తీర్థము, పెంకులోపోసిననీళ్ళు.
227 సంతోషమే సగము బలము.
228 భక్తిలేనిపూజ పత్రిచేటు.
229 తెగించి దానముచేసెద తేరా పిడికెడు అళ్లు.
230 తూమెఁడు వడ్లు తూర్పారబెట్టుసరికి ఏడుము వడ్లు ఎలుకలు తిన్నవట.
231 తెడ్డునకు పాకగుణము తెలియునా?
232 నూఱు నోములు ఒక అంకుతోసరి.
233 పొట్టివానికి పుట్టెడు బుద్ధులు.
234 పోరునష్టము; పొందులాభము.
235 కలకాలపుదొంగ ఒక్కనాడు దొరుకును.
236 పిల్లికి చెలగాటము, ఎలుకకు ప్రాణసంకటము.
237 నిజము నిలుకడమీద తేలును.
238 సెనగలు తిని చేయికడిగికొన్నట్లు.
239 ఒకటొకటి నాటిన చెట్టొకటి మొలచునా
240 రాచపీనుగు తోడులేకుండ చావదు.

"కమలం!"

"ఆఁ, వస్తున్నానండి"—నిమిషములో వచ్చింది కమల.

"ఎందుకు పిలిచారు!" అనే ప్రశ్నార్థక దృక్కులు ప్రసరించింది.

"ఈ గులాబి ఎంతచక్కగా ఉన్నదో చూడు! వెలుగు నీడలు చిత్రించడం నేర్పనా?"

"ఏమోనండి! చిరాకుగా ఉన్నది. రేపు నేర్చుకుంటాను, ఇవ్వాళ మాత్రం నిన్నటి మోడల్ 'Model,' పూర్తి చేస్తాను." అన్నది బద్ధకంగా.

"మొన్నయిచ్చిన పాఠం ఇంకా అప్పగిస్తూనే ఉన్నావు కదూ!" అన్నాడు ప్రభాకర్.

"అయ్యో! అన్నీ ఒకేసారి ఎలా తెగలపడుతాయండీ"—అంటూ వంటగదివైపు వెళ్లింది కమల.

ప్రభాకర్ ఆలోచనలో పడ్డాడు. ......... చదువంటే చిరాకు, విజ్ఞానమంటేవిసువు, స్త్రీజాతికి సహజమేమో ననిపిస్తుంది. ఆడవాండ్లకు చదువు అవసరమని చెప్పితే "మేము ఉద్యోగాలు చేస్తామా? ఊళ్లేలుతామా?" అనేది మొదటిప్రశ్న. ఎలాగో దానికి సమాధానం ఇచ్చేవరకు "ఇంటెడు పనితో ఎలా తంటాలు పడాలి? ఇటు సంసారం, అటుచదువు?" అని రెండోప్రశ్న తయారు! ఇంటిపని బరువు తగ్గించడానికి పని మనిషి నేర్పాటుచేసినా ఏదోఒక సణుగుడు, ఉంటునే ఉంటుంది. అగర్భశ్రీమంతుల ఆడబిడ్డలకు అసలే తృప్తిఉండదు, ఎన్ని ఆభరణాలున్నా. అది వాండ్లకు చెల్లుబాటు. కాని మధ్యతరకపు కుటుంబాలకు చెందిన స్త్రీలకు చెల్లుబాటు ఎలా అవుతుంది? వీళ్లూ సొమ్ముల యావలో పడటమంటే అందనిమ్రాని పండ్లకు అఱ్ఱు చాచడమే! ఈవిషయం తెలుసుకునేజ్ఞానం ఉండకూడదు? జీవితం ఆనందంగా గడపాలంటే ఏంచేయాలో తెలియదు. పుష్టికరమైన జాతిని సృష్టించడంలో తాము ఏవిధంగా తమ విధిని నెరవేర్చగలరో తెలుసుకోలేని అజ్ఞానంలో స్త్రీఉంటే జాతి పురోభివృద్ధి ఎలా జరుగుతుంది? ఇటువంటి ఇల్లాండ్రమూలాన జాతికి తిరోగమనంవినా "అన్యథాశరణం నాస్తి" అంటే అతిశయోక్తి కాదేమో! ఒకవైపు పిల్లలపోషణ తెలియదు; మరోవైపు ఇంటి సౌందర్యం చూస్తే ఇల్లాలి గృహనిర్వహణా నైపుణ్యం ఇట్టే బయట పడుతుంది. ఇటువంటి ఇంటిలో అడుగిడు మగవాడికేలా ఉంటుందో ఏం ఊహించగలుగుతారు!!......" ఈ విధమైన ఆలోచనా పరంపర మెదడులో పరుగులు తీస్తున్నాయి.

నిజంగా ప్రభాకర్ మనస్తత్వం అగోచరం. లలితమై భావసముదాయంతోగూడి చక్కనిసంస్కారం, సునిశితభావ గాంభీర్యం అతనిహృదయంలో చోటుచేసుకున్నవి. ఈశ్వరదత్తమైన సహజాతాలు అతనిలో కళాంకురాలను నాటినవి. అభివృద్ధి పొందుచున్నకొలది అతని జీవితాశయ ఆదర్శాలు విశాలం కాసాగినవి. కళాక్షేత్రంలో కృషితోపాటు జీవితపరమార్థం విస్తృతం కాసాగింది. భౌతికజీవితావసరాలకు తగిన ఆర్జన మాత్రమే తనకర్తవ్యం అని నిర్ణయించుకున్నాడు. తదుపరి అతనికి అత్యంతప్రియమైనది కళాజీవితములోని సౌందర్యమయరసజగత్తు. ఐహికాముష్మికముల రెంటిని సమన్వయించు జీవిత విధానమే అతని లక్ష్యం! పవిత్రమైన సామాన్యజీవితం, గంభీరమై ఉజ్జ్వలమైనభావన- అతని ఆశయం. తదనుగుణ్యంగా ఇంట-బయట తన జీవితాన్ని తయారుజేసుకోదలచి కృషిచేస్తున్నాడు. తనజీవితాన్ని విజయవంతంచేసుకోవాలంటే తనజీవిత సహభాగినియైన కమలం సహకరించడం అవసరమని గుర్తించాడు. "స్త్రీకి విద్య విజ్ఞాన చైతన్యాలుకలిగించి

ధీరోదాత్తులైన సత్పుత్రీపుత్రులను దేశమాతకు కానుకగా సమర్పించడమే ప్రతిమానవుని ఏకైక కర్తవ్యం" అని అతని నిశ్చితాభిప్రాయం. కర్తవ్యం నెరవేర్చడంలో కొంతవరకు కృతకృత్యుడు కాసాగాడు... కాని అడుగడుగున దినగండమే, గృహజీవితంలో.

అతని అర్ధాంగి కమల. రూపసౌందర్య ప్రేమానురాగాల్లో పోటీ చేయగలిగినా అతని ఆశయ ఆదర్శాలను అర్థంచేసుకోలేక పోయినది. ఆమెది అదోతీరు వింతప్రకృతి. ఆమెకు భర్తయందలి అనురాగమెంతో చెప్పవలసివస్తే భానూదయానికై నిరీక్షించుచున్న పద్మినీకాంతకు తీసిపోదు. నిర్మలప్రేమపాశంతో అతని హృదయాన్నే బంధించింది.

ఇన్ని ఉన్నప్పటికి ఇరువురిలో చెప్పదగిన వ్యత్యాసాలు కనిపిస్తయి. ఇరువురిజీవిత దృక్పథాలు వేర్వేరు. ఆశయ ఆదర్శాలు భిన్నం. ఒకరిది సంకుచితం, కేవలం భౌతికమూనూ! మరొకరిది విశాలం. కేవలం ఆధ్యాత్మికమేకాక ఐహికాన్నికూడా అనుసంధించే ఆదర్శమే లక్ష్యం. ఒకరిది నిరర్థకం, అనర్థకమూనూ! మరొకది ఇహపరముల రెంటిని సమన్వయించుకొన్న ఉన్నతాదర్శసంపన్నం. ఈ వ్యత్యాసాలను పురస్కరించుకొని పరస్పరం కలిగే మానసికసంచలనం చాలచిత్రంగా ఉంటుంది.

ఆమెలోని విద్యాసంస్కారశూన్యత ఆమె ఆశయఆదర్శాలను సంకుచితపరచింది. ప్రేమించి ప్రేమింపబడడం, భర్తకు సేవచేయడం, పిల్లలకనడం, కడుపునిండ తినడం, ఒంటినిండా బట్టకట్టడం, కృత్రిమ అలంకారాలతో సంఘంలో తనగొప్పను చాటబూనడం ...... ఇత్యాదితో నిండిఉంటుంది ఆమె జీవిత పరమార్థం. కలవారి ఆడబడుచుల్లకు నగ-నాణ్యాంయొక్క వాంఛచెల్లుబడి అవుతుంది, మధ్యరకపు స్త్రీ సందర్భానుసారంగా పరిసరాలకు లోబడి, భ్రమకులోంగి ఆవేదనకు గురిఅవుతుంటుంది. అందుకనే చదువంటే చిరాకు వినువూనూ!!

అతని విశాల, ఉన్నత, ఉజ్జ్వలఆశయ ఆదర్శాల ననుసరించి జీవితములో పొందదగినది కేవలము శారీరకముగాక హృదయానందమే జీవితపరమార్థం. "ఆనందో బ్రహ్మయటన్న బ్రౌనుడి" నిసాధించడమే అతనికి కావలసినది. కళాజీవితములో రసమయజగత్తులో విహరించడమే మార్గం. కళాక్షేత్రంలో చేస్తున్నకృషికి ఫలితంగా కలిగే ఆనందానుభవాన్ని అందరికి అందజేస్తున్నప్పుడు తనజీవిత సహభాగినియైన కమలకుమాత్రం ఎందుకు అందజేయకూడదు?

"వెన్నెల రాత్రులలో ...... ఇసుకతిన్నెలపై ...... గొంతులుకలిపి ...... గానంచేస్తూ... మైమరచి కమలతోగడపితే ఎంతహాయిగాఉంటుంది" తానువ్రాసేచిత్రాలకు కమల భావాలుఅందిస్తు రంగులు కలిపిఇస్తుంటే చిరస్థాయిగా నిలిచిపోయేచిత్రాలు తయారుకావు?

తాను వ్రాసినగేయాలను ఆమె తన హృత్తంత్రులమీటి శృతిగల్పి గానంచేస్తున్నప్పటి ఆనందం తన కెన్నడోకదా! — ఈవిధంగా కలలు కంటూఉంటుంది అతని కళాహృదయం.

ఇవన్నీ కమలానికి అగమ్యగోచరం. పైగా బంధనలవలెకనిపిస్తయి. అందుకని ఆమెకదో తీవ్రవేదన.

అతనికి ఆమెలో చైతన్యంకలిగించి తన ఆదర్శశిఖరం అధిరోహించటం ఎలా? అనే ఆవేదన! ఇది నేటికీ విడదీయరాని సమస్య అయిపోయింది...........

—★—

# అనాథ బాలికలు

శ్రీ వఝ్ఝల వేంకటేశ్వర కవిగారు

చారుతరమ్ముగా మిసిమిజవ్వనపున్ గరువమ్ము నిబ్బర
మ్మై రమణీయమై తనువునం దఖిలావయవమ్ములందు నే
పారగ రాజహంసములయట్లుగ ఏనుగు గున్నలట్లు లో
య్యారముగా చరించు తరుణాంగులు లౌకిక సంప్రదాయముల్
నేరని ముద్దరాండ్ర మృదునిర్మల చిత్తములందు నూత్నవి
స్ఫారితమైన అమ్మధురభావము లెట్టివో! విచ్చుపూవులన్
సౌరభమట్లు తేనియలచాడ్పున కమ్మగ తియ్యగా ఎదన్
కోరిక లేవొ గాఢముగ గూఢముగా ఎటు లావరించునో
ఊరునో! బైలువోవు నని ఊపిరి నేనియు తీయనీని దు
ర్వార కఠోరశాసనపు బల్మికి లొంగుచు అస్వతంత్రలై
తీరని వేదనన్ పొగిలి దీనతనొందు అనాథ బాలికల్,
వారి అభాగ్య జీవనములన్ తెలియంగనె రాతిగుండెయున్
నీరగుచున్ కరంగు నవనీతముకైవడి సానుభూతిమై.
ఆ రుధిర ప్రవాహమునయం దుడుకెత్తిన యౌవనాగ్ని చ
ల్లారక మీరగా పొడము ఆకలిదప్పుల దీర్ప సర్వసా
ధారణమౌచు చేతన వితాన సదానుభవాభిరామమై
ధారుణి సృష్టికిన్ సహజధర్మముగా ఒనగూడునట్టి వ్యా
పార మమాయకాత్మలగు వారికి ఏమిటికిన్ నిషిద్ధమో?
పూరుషకోటికిన్ వయసుప్రొద్దు క్రమమ్ముగ అస్తమించుచున్
జారుకొలంది హెచ్చగుచు చావని తృష్ణకు నిత్యశాంతి చే
కూరగ ఎన్నియెన్ని లతకూనల డెందపు పూలలోని మా
ధ్వీరసపూరమెల్ల పెనుతెంపగు ఈవిగ ఒక్కమారుగా
ఊరక ధారవోయబడెనో కఠినాత్ముల శక్తిముష్కర
క్రూరతరాధికారమున! ఘోరమయం బనిసించు; ఈ దృశా
చారము బద్ధమో మనుజసంతతినీతికి, బల్విరుద్ధమో!
చీరయు రైకయున్ చెలిమిసేయని ప్రాయపు మేని పొల్పు, సం

స్కారసుమప్రసాధనము చాలని పెన్నెరిగుంపు సొంపు, పీ
తారుణ వర్ణశోభ యిరవందని అచ్చపు మోముగో, మలం
కార విశేషముల్ వెలితిగా తగు ఆ సుకుమార మూర్తి, ఆ
ధారము లేని వల్లిక విధంబున ఎంతయు దైన్యమొందు కాం
తారతల ప్రఫుల్ల సుమనస్తుహీనప్రభ లట్లు వ్యర్థమై.
ఆ రమణీ లలామముల అక్షులనుండి స్రవించు అశ్రువాః
పూరము లేకధార అయి పొంగగ అందుల తీర్థమాడి ఆ
సారసపత్రలోచనల స్వాంతములన్ ప్రభవించి వేడి ని
ట్టూరుపు గాడ్పులన్ ప్రబలునుజ్వల దుఃఖమహాగ్ని కీలికాం
వారమునందు నిల్చి తనపాపము క్షాళితదగ్ధమై చనన్
భారత సంఘ ధర్మమది పావనతన్ గడియించు టెన్నడో!

నా 'మాతృవందనము'నుండి.


# సౌందర్య రహస్యము

★

## అశోకా ఆమ్ల హెయిర్ ఆయిల్



కేవలము శిరోజాభివృద్ధినేగాక మేథాశక్తి నభివృద్ధిపరచుటలో సాటి లేనిది. మరియు, మెదడునకు చల్లదనము, నేత్రములకుశోభ, ముఖ వర్చస్సును కలిగించును. కురులకు కాంతి, కుదుళ్లకు బలము, తుమ్మెద రెక్కలవంటి నలుపుదనము, పట్టువంటి మృదుత్వమును, మనమున కుల్లాసమును కలిగించు పరిమళము నొసగుటలో గల రహస్యమే మనగా యియ్యాగి, వట్టివేరు, అగరు, చందన, కేతకి, ఆమలక, భృంగబ్రహ్మి మొదలగు పరిమళము, గుణము, రెండునుగల ఓషధులను ఉపయోగించి సక్రమపద్ధతులపై అత్యుత్తమ పరిమళ ద్రవ్యములనుచేర్చి తయారు చేయబడినది. గాన, భారతదేశపు నారీమణులేగాక, యితరదేశపు మహిళలు కూడ దీనినే కోరుచున్నారు.






VIJAYA CHEMICAL & TOILET WORKS
21 & 22, SURIYANARAYANA CHETTY STREET,
RAYAPURAM — MADRAS.




## మదాం ష్యాంగ్ కై షెక్

శ్రీమతి యం. సుశీలగారు

నేటి చీనాగురించి తెలిసికోవాలంటే పెద్దచరిత్ర చదవాలి. కాని ఒక్కగాని ఒక్క ప్రపంచ విఖ్యాతమైన జీవితచరిత్ర చదివితే చీనా హృదయాన్ని ఎంతో చక్కగా అర్థంచేసుకోగలము. అంత చక్కగా చీనా హృదయం ప్రతిబింబిత మవుతూంది, మదాం ష్యాంగ్ కై షెక్ జీవితచరిత్రలో.

రెండవ మహాసంగ్రామ ఫలితంగా చీనా— అంతవరకూ దూరంగాఉన్నది. నేడు భారతీయులకు చాలా సన్నిహితమైంది. దీనికి ముఖ్యంగా కారణం మదాం ష్యాంగ్ కై షెక్ కృషిఫలితమే. అటువంటి మహాత్మురాలి జీవితచరిత్ర మనం తెలుసుకోడంతో ఆగక, మనమందరంకూడా ఆమె అనుసరిస్తున్న పంథా ననుసరించి, నేడు సంపాదించుకున్న స్వాతంత్ర్యాన్ని ఉపయుక్తం చేసుకోవాలని నా కోరిక.

షాంఘై మహాపట్నంలో క్రైస్తవమతం స్వీకరించి మోతుబరిగా చార్లీసూంగ్ పాశ్చాత్య-ముఖ్యంగా-అమెరికా నాగరికతా వాసనలతో జీవితం సాగిస్తుయుండేవాడు. అతనికి ముగ్గురుమగపిల్లలూ ముగ్గురుఆడపిల్లలు-సంతానం. ఆఖరి పిల్లపేరు మీలింగ్-ఆమె తర్వాత మదాం ష్యాంగ్ కై షెక్. మీలింగ్-శైశవంనుండే ప్రతిభగలపిల్ల. ఆమె కుటుంబం జాతీయతా ప్రభావంగలది. చీనా సామ్రాజ్య పతనానికి సూంగ్ కుటుంబం రహస్యంగాను, బహిరంగంగానుకూడ పాటుబడేది. అమెరికాతోను అమెరికనుల నడవడికతోను చాలాఎక్కువగా - పరిచయం వుండడం - తర్వాత దేశభక్తి - ఈ రెండిటిలోను మీలింగ్ చిన్నప్పటినుంచి బుద్ధిపోనిచ్చి, తన జీవితాన్ని చీనాదేశం స్వాతంత్ర్యసిద్ధికి అర్పించేందుకు సమయంకోసం ఎదురు చూస్తూండేది.

చార్లీసూంగ్, తనఆరుగురుపిల్లల్ని చదువునిమిత్తం అమెరికాపంపాడు. అమెరికాచదువు- అమెరికాలో వాసం- ఈరెండూ మీలింగ్ జీవితాన్ని పూర్తిగా మార్చేశాయి. ఒకనాడుమీలింగ్ సరిగ్గా అమెరికనులా మాట్లాడ్డంచూసి ఆశ్చర్యపోయి మీలింగ్ సహాధ్యాయిని, "మీలింగ్! నీవునిజంగా చీనా వనితవా? నేను నమ్మను!" అందిట. మీలింగ్ చదువులదుత్త. వేదాంతం, ఆంగ్లం, ఫ్రెంచి, పియానో, వైలిన్ వాద్యం మొదలైనవన్నీ క్షుణ్ణంగా నేర్చుకుంది.

ఒక నాలుసంవత్సరాలు అమెరికాలోయుండి చదువుపూర్తిచేసుకొని మీలింగ్ తిరిగి తనదేశం వచ్చేసింది. చీనాలోనుండినదిసామ్రాజ్యతత్వం, సూన్‌యట్ సేన్ సూంగు కుటుంబాలు కూమింగ్‌టాంగ్ అను ఒక సంస్థనేర్పరచి, చీనా సామ్రాట్‌ని తరిమివేశారు. ఆసమయంలోనే మీలింగ్ తనదేశం [illegible] చేసింది రాజకీయరంగంలోకి దూకింది. అమెరికాలో స్వాతంత్ర్యం అంటే ఏమిటో చవిచూచిన మీలింగ్ తన జన్మహక్కైన స్వాతంత్ర్యంకోసం నడుముబిగించింది.

షాంఘై అంతర్జాతీయంగా స్థాపితమైన మహాపట్టణము. తత్ఫలితంగా షాంఘైపట్నం అవినీతికి

అన్యాయాలకీ ఆటపట్టైంది. పరదేశీయుల ప్రాబల్యంవల్ల చీనా ప్రజకూడా సంఘానికి చెద పురుగుల్లా తయారయారు. మీలింగ్ తన జాతి పతనాన్ని చూసి, విస్తుపోయి జాతి ఉద్ధరణానికి సంఘసంస్కారానికి ఉద్యమించింది. Child-Labour commission అను సంస్థలో సభ్యత్వం సంపాదించుకొని సంఘోద్ధరణకి ముందంజ వేసింది. National film censoring commission అనే సంస్థలోకూడా సభ్యత్వం సంపాదించుకొని అవినీతికరమైన చలన చిత్రాలను ప్రేక్షకలోకానికి చూపకుండా చేసింది.

రాజ్యాంగంగా సాంఘికంగా ఒళ్లుదాచుకోకుండా తన దేశప్రజని ఉద్ధరించే దినాలలోనే ష్యాంగ్ కైషెక్‌తో తారసిల్లింది. అతనిదో చిత్రమైనగాథ.

ష్యాంగ్ కై షెక్ అసలుపేరు. చియాంగ్ చుంగ్ చెంగ్. చియాంగ్ కార్యశూరుడు; పట్టుదల దీక్షకలవాడు. Tokyo Military Academy లో తరిఫీదుపొందిన యోధుడు. సూన్ యట్ సేన్ స్థాపించిన కుమింగ్ టాంగ్ సంస్థలోజేరి-చీనా నేత—సూన్ యట్ సేన్ చేత, 'శహభాష్' అనే మెప్పును పొందాడు. సూన్ యట్ సేన్ తదనంతరం చియాంగ్ చుంగ్ - చెంగ్ పార్టీనాయకుడై చీనా ప్రజకు అధిపతై నిలిచాడు. అప్పణ్ణించి అతణ్ని జనులంతా ష్యాంగ్ కై షెక్ అని పిలవడం ప్రారంభించారు.

ష్యాంగ్ కై షెక్ మొదటిభార్యకు విడాకులిచ్చి మీలింగ్‌తో ప్రణయం జరిపాడు. మీలింగ్ చీనా వీరుణ్ణి మనసార ప్రేమించింది. కానీ మతం అడ్డువచ్చింది. మీలింగ్ తల్లి, క్రైస్తవమతం స్వీకరిస్తేనేకాని, తనకూతుర్నిచ్చి వివాహం చేయనని, ష్యాంగ్ కై షెక్‌తో చెప్పింది. ఆలోచించి మీలింగ్ కోసమని ష్యాంగ్ కై షెక్ తన భౌద్ధమతాన్నికూడా మార్చుకున్నాడు. వివాహానంతరంనుంచీ మీలింగ్ - మదాం ష్యాంగ్ కై షెక్ అయింది.

తన భర్త అడుగు జాడల్లో నడుస్తూ రాజ్యాంగానికి సారథ్యం వహించింది. 1936 సం॥రంనుంచి మదాం ష్యాంగ్ కై షెక్ National Aviation commission కు Secretary General గా ఉంటూంది. ఆ పదవిలోఉండి ఇతరదేశాలనుంచి వైమానిక సహాయం సంపాదించింది. చీనా దేశీయులని అద్భుతమైన వైమానికులుగా తయారు చేసింది.

నిజముగా ష్యాంగ్ కై షెక్ మీలింగ్‌నే వివాహమాడనివాడు. చీనా భవితవ్యం హిట్లరు జర్మనీ, ముసోలినీ ఇటలీ, ఫ్రాంకో స్పెయిన్ మాదిరిగా, నియంతృత్వ అధికార బలంతో మూల్గుతూయుండేది. కారణం షియాంగ్ కూడా ఒక నియంత అయియుండేవాడు. కాని మదాం షియాంగ్, షియాంగ్ జీవితంలో పరివర్తనం తీసుకొచ్చింది. లింకన్, వాషింగ్‌టన్ ప్రభృతులను ఆదర్శాలుగా పెట్టుకొని, పని చేయువలసిందని తన భర్తకు చెప్పింది. తత్ఫలితంగా షియాంగ్ ఆదర్శ ప్రియుడయాడు. త్యాగమూర్తి అయాడు. స్వార్థం చంపుకున్నాడు. క్రైస్తవ బౌద్ధమతాల సారాంశాలను జీవితంలో రంగరించుకుని ఆ ఆదర్శాల ఫలప్రాప్తికై పాటుపడుతున్నాడు.

కూమింగ్‌టాంగ్ పార్టీలో అంతఃకలహం చెలరేగింది. అసంతృప్తి చెలరేగింది. జనరలిస్సిమోపై దాడి సల్పారు కొందరు సిపాయీలు. జనరలిస్సిమో, దొంగిలింపబడ్డాడన్న వార్త మదాంషియాంగ్, చెవిని పడింది. భర్త స్థితి

గ్రహించింది. అతని స్థానే తాను రాజ్యాంగాన్ని నడిపించాలన్న బాధ్యతతో తన భర్త చెరగురించి విచారించక సమయస్ఫూర్తితో భర్తను విడిపించేందుకు ప్రయత్నాలు జరిపింది. అంతఃకలహాన్ని రేగకుండా చేయడానికి పన్నాగాలు పన్నింది. ఇంతలో ష్యాంగ్ కై షెక్ అంతఃకలహము లేవదీసిన నాయకునితో మాట్లాడాడు. నీతి బోధించాడు. నాయకుడు వినమ్రుడై జనరలిస్సిమో ఎదుట పశ్చాత్తప్తుడై నిలచాడు. మదాంషియాంగ్ తన భర్త బందీకృతుడైయున్న పట్నానికి ఒంటరిగా వెళ్ళింది. అంతఃకలహము లేవదీసిన సిపాయీలలో ముచ్చటించి సంధిజరిపింది. తన భర్తను విడుదల చేయించి ఇంటికి తీసుకు వచ్చింది.

మదాం ష్యాంగ్ కై షెక్ కృషి ఫలితంగా చీనా అంతరంగ విముక్తి సంపాదించింది. పాత సాంప్రదాయాలతో ఛాందసంగా అభివృద్ధి లేకుండా కుళీరంలా వెనక్కు నడుస్తూన్న జాతిని ముందుకు నడిపిస్తూంది. జాతి, జీవంతో నిలవాలంటే శీలం కావాలనీ ఆ పవిత్రమైన శీలం నాశనం అయిపోయిందనీ మదాంషియాంగ్ ఘోషించి, ప్రథమసోపానంగా విద్యాభ్యాసానికై ఒక పెద్ద ఉద్యమం లేవనెత్తింది. ఎక్కడపడితే అక్కడ - విద్యాగంధమెరుగని చీనా జాతిలో విద్యకోసం - జ్ఞానంకోసం ఒక పెద్ద పిపాస యేర్పడింది.

చీనా దేశీయుల, ఆర్థిక దుస్థితి, మన భారతీయుల ఆర్థిక దుస్థితికంటే హీనంగావుంది. చీనావారి ఆర్థిక దుస్థితిని బాగుచేయాలని మదాంషియాంగ్ అన్ని విధాలా పాటుపడుతూంది. చీనాలో New life Movement,-నవజీవనము అని ఒక ఉద్యమం లేవదీసింది. ఈ వుద్యమం నిజంగా చీనావారికి కొత్త జీవితాన్నే ప్రసాదిస్తూంది. చీనా విద్యార్థులందరూ ఈ ఉద్యమాన్ని చీనాదేశంలోని కుగ్రామాలలోకూడా లేవదీశారు. ఈ ఉద్యమం ఒక ఆశాజ్యోతిలాగా వెలుగుతూంది.

జపాను అన్యాయంగా దురహంకారంతో చీనామీద విరుచుకుపడింది. మదాం షియాంగ్ తనకుగల పలుకుబడితో అమెరికాని సాయం కోరింది. కానీ, జపాను పట్ల పక్షపాతం చూపిన అమెరికా చీనా మొరవినలేదు. అయినా సరే మదాంషియాంగ్ తన దీక్ష విడవక చివరకు అమెరికా, సాయం సంపాదించింది. తత్ఫలితంగా జపానుకి పతనము సన్నమైందన్న సంగతి అందరికీ తెలిసినదే.

జనరలిస్సిమో, మదాంషియాంగ్ 1942 లో మన దేశం వచ్చారు. వారికి స్వాగతమిస్తూన్న సందర్భంలో. అప్పటి ఇండియా వైస్రాయ్ మదాం ష్యాంగ్ - కై - షెక్ గురించి ఇలా అన్నాడు.

“చీనాజాతి ఉద్ధరణకి మదాంషియాంగ్ నామం ఒక కొత్త ఉత్సాహం. ఒక్క చీనాకే కాదు. ముఖ్యంగా, భారతదేశానికికూడా ఆమె జీవితం అదర్శప్రాయమైనది.” మదాం షియాంగ్ సమాధానం ఇస్తూ, “చీనాదేశపు స్త్రీలు కష్టాలకోర్చి యుద్ధాలలో జయంపొందారు. అన్ని జీవితరంగాలలోనూ చీనా స్త్రీ సమర్థురాలు. ఆ మోస్తరుగానే మీరుకూడా స్వరాజ్య సంపాదనకై పాటుపడుతున్నారు. పాటుపడండి. ఫలితంకోసం మీరు తాపత్రయపడకండి. ఫలితం మీరు అనుభవించకపోయినా, మీ తరువాతి తరంవాళ్లు అనుభవిస్తారు.” అని భారత స్త్రీలకు సందేశం చెప్పింది. మహాత్మాగాంధీని ష్యాంగ్ దంపతులు సందర్శించారు. ఆ సమయంలో గాంధీమహాత్ముడు నూలు వడుకుతున్నారు. “మహాత్మా! నూలు వడకడం నాకూ నేర్పరూ?” అని మదాం

షియాంగ్ అడిగితే, "ఓ! తప్పకుండానమ్మా! శాలో సేవగ్రాంవచ్చివేయ్. నిన్ను జనరలిస్సిమో ఇక్కడ చీనా రాయబారిగా ఉంచేయమను. నిన్ను నేను నాకూతురుగా దత్తంచేసుకుంటాను!" అని మహాత్ముడు చిరునవ్వు నవ్వాడు.

మదాం ష్యాంగ్, కై షెక్ ప్రపంచ వనిత. చీనా దేశీయులమాత. అమెరికా ఆమెని పూజిస్తుంది. ఆమె కాయం చీనా. ఆమె ఆత్మ మాత్రం అమెరికా. నిజానికి ఆమెకి రాజ్యాంగ వ్యవహారాలంటే రోత. అయినా ఆమె చీనాజాతి భవితవ్యాన్ని దిద్దుతూంది.

A. I. R. అనుమతిని.




కుష్టు ★ బొల్లి

వగయిరా మేహపుచ్చలు, సెగ, సవాయి వ్యాధులకు గ్యారంటీ చికిత్స.

వెంటనే క్యాటలాగుకు వ్రాయుడు:

జి. వి. రెడ్డి, ప్రొప్రయిటరు

బి. రెడ్డి అండ్ కో (రిజిష్టర్డు)

గోపాలపురం. తూ. గో. జిల్లా —— వయా. తణుకు. M & S. M. Ry.



మిస్ గిలియన్ లూసీస్టర్టన్ - 18 సం॥ బాలిక

రాయల్ ఏర్‌క్రాఫ్ట్ యస్టాబ్లిష్‌మెంటు (బ్రిటన్)లో తర్ఫీదునందడానికి ప్రవేశపరీక్షలో ఉత్తీర్ణురాలైన ప్రథమబాలిక. లండన్ టెక్నికల్ కాలేజీలో పాఠాలు ప్రారంభించుచున్నది.

# స్వతంత్ర పర్వం

"సత్యకుమారి"

అంధకారం అణగిమణగగ
దేశమంతయు దీప్తివెలుగగ
నూత్న తేజపు వెల్లువలతో
స్వాతంత్ర్య భానుడు లేచెగా!

మలయమారుత గంధమెల్లరి
డెందముల కానంద మీయగ
వెలుగు వెల్లువ నిలువద్రొక్కగ
స్వాతంత్ర్య కాంతులజిమ్మెగా!

అరుణ రేఖల నలముకొనుచూ
తూర్పుగిరిపై తొంగిచూచుచు
చిరుతహాసము చిందులాడగ
స్వాతంత్ర్య చంద్రుడునవ్వెగా!

కోకిలమ్మలు గొంతువిప్పెను
నీరజపు నీరాజనలతో
విజయ ఘోషలువినెడు వేడుక
స్వాతంత్ర్యవీరుడ లేవరా!

# వ్యభిచార నిర్మూలనము

శ్రీమతి R S. అన్నపూర్ణాదేవిగారు

భారతదేశానికి గౌరవప్రాప్తి కల్గించిన వారిలో స్త్రీల కత్యున్నత స్థానముగలదు. భారతదేశము పాతివ్రత్యమున కునికి. విషయవాంఛాపూరిత మనస్కులై, స్వేచ్ఛావిహారమున వర్తించు, యన్యదేశీయుల వివాహములకు భారతావనిలోని వివాహబంధము విచిత్రమై కన్పట్టినను, యందలి పవిత్రత వారి నాకర్షించినది. భారతదేశ ప్రాశస్తికి భారతనారి యొక కీలకమువంటిది.

పూజ్య 'బాపూజీ' బోధలోని సారమదియే! భారతనారి చేతులలోనే భావిభారత సౌభాగ్యమున్నది. 'The hand that rocks the cradle rules the world'. భావిపౌరుల గౌరవప్రవృత్తులకామె పునాది. ఇట్టిచో, మనపవిత్ర దేశమునకూడా కొన్నికళంకములు లేకపోలేదు. అందున పేర్కొనవలసినది వ్యభిచారము. హద్దుమీరిన విషయవాంఛాసక్తివల్లనేమి, పరిస్థితులవల్లనేమి, ఎట్లో ఈ కళంకము ప్రాకియున్నది. ఈ వ్యామోహము చరిత్రాత్మకమైయున్నది. 'కాశికిపోయినా కాసుకొక్కటె'యను సామెతయేకలదు, ఇది ఘోరదుర్మార్గము. దానినుండికల్గు నష్టములెన్నేనికలవు.

వ్యభిచారవృత్తికి కారణములెన్నేనికలవు. ముఖ్యముగా పెక్కుమంది జీవనాధారముగా, మరికొందరు కామవాంఛల తీర్చుకొనదలచి, యీవృత్తికి పాల్పడినారు. భారతదేశమునందలి దుర్భరదారిద్ర్యబాధయే పెక్కు'యమాయికల' నీ వృత్తిలోనికీడ్చినది. పాశ్చాత్యదేశములం దీదురాచారము దారిద్ర్యమునకాక, గౌరవాసక్తి, పేరుప్రశస్తుల ప్రాకులాటలచే కల్గినది. పదిమందిలో చనువునకైన ప్రాకులాట యీదుర్మోహమునకు కారణమైనది. ఇచ్చటనిది యొకవృత్తియైనది. ఈవృత్తివారసంఖ్యాకులు. కామతృప్తులసంఖ్య కొద్ది.

మొన్నమొన్ననే బొంబాయి రాజధానిలో యీ వృత్తి నరికట్ట దొరతనమువారు ప్రయత్నించుట ముదావహము. వ్యభిచారమువలని నష్టములెన్నేనికలవు. గౌరవకుటుంబీకుల నడుమ వీరు వాసము లేర్పరచుకుందురు. దినచర్యల ననుసరించు యమాయకులెందరేని యటు వెళ్లుచుందురు. ఏనాటికేని చంచలతకు వారు కారకులుకాకపోరు. ఇంతియేకాక స్త్రీ వ్యాధులకు మూలకారణమీవేశ్యలే. ఇట్టి ఘోరవ్యాధులకుపాలైన వ్యక్తుల ఆరోగ్యములు నశించుటయేకాక వారు బలహీనులైపోదురు. ఇట్టి విపత్తే పెరిగినచో పవిత్రభారతావని దుర్మోహితుల కాలవాలమై, అపవిత్రమై, అశక్తులగుపిల్లలు కల్గి దురపిల్లకమానదు. ఇట్టిహేయస్థితికి రాకమునుపే మనమందరము ముందంజవేసి ఈ వృత్తి నరికట్ట ప్రయత్నింపవలయును. భావిపౌరుల జీవితములు మనచేతనుండుచో మనమేవారి జీవితముల చక్కదిద్దనిచో మరిభారతమాత గతియేమి? మహామహుల స్వాతంత్ర్య సమరమున కర్థమేమి? ప్రభుత్వాచర్యలకు ప్రతిస్త్రీ తోడ్పడి పతితుల నుద్ధరించి భారతమాత సౌభాగ్యమును పెంపొందించి ధన్యుల మగుదుముగాక!

(o)




సాధారణమైన పడుచే - ఆరోగ్య ప్రదమయిన నడవడిక, విచక్షణతో అంగరాగముల వాడుక - వీటి మూలాన అందాలరాణి, ఆకర్షణీయ మూర్తియై - జహాంగీరు చక్రవర్తిచే నూర్జహాన్ (రాచనగరిదీపము అని పిలువబడినది.)

నేటి స్త్రీలు చర్మలావణ్యానికి ఆకర్షణకు, చెక్కక నే కేరళ రోస్ సోప నెన్ను కొంటారు.

A MADRAS GOVERNMENT PRODUCT

KERALA

Rose Soap




Mfrs : KERALA SOAP INSTITUTE, CALICUT.

Department of Industries & Commerce, MADRAS.

FAS-366

# 'గృహలక్ష్మి'కి పద్యరత్నాలు



శ్రీ కల్లూరు అహోబలరావుగారు

పెండిలియగు వఱకే నీ
కుండును కాలంబుగాన నోర్పున విద్యల్
నిండుమనంబున నేర్వుము
పెండిలివయసునకు ముందె ప్రియగృహలక్ష్మీ!

కులమును శీలము విద్యయు
తెలసిన తగువరుని వెదకి వెలదీ! నిన్నున్
తలిదండ్రు లతని కిత్తురు
చెలువుగ వరియింపు మతని శ్రీగృహలక్ష్మీ!

కౌమారంబున తండ్రియు
యామీఁదట జవ్వనమున యతివలకెపుడున్
ప్రేమమున భర్తరక్షకుఁ
డీమాట నిజమ్మునమ్ముమీ గృహలక్ష్మీ!

రక్షించు వార్ధకమ్మున
రక్షకుడై పుత్రకుండు రమణిరో! నీవీ
శిక్షణము దెలిసికొనుము; ము
ముక్షుల మతమిద్ది తెలియుమో గృహలక్ష్మీ!

దాంపత్య ధర్మసూక్ష్మము
లింపారఁగఁ దెలుపునట్టి వీసూత్రంబుల్
సొంపునఁ బాలించినచో
దంపతులకు శుభము గల్గదా? గృహలక్ష్మీ!

స్వాతంత్ర్య జన్మదిన

# హృదయపూర్వక అభినందనలు

దిహిందూస్థాన్




మెటల్ రిఫైనరి అండు రోలింగు మిల్సు.

ఆఫీసు ఫోను-2999 కార్యాలయము ఫోను-3177

గ్రామ్సు :- రోలింగు మిల్సు

ఇండియా పెట్టుబడి-ఇండియా పరిశ్రమ

ఇండియా మేనేజిమెంటు

చాలా కాలమునుండి తీరని పరిశ్రమకొరతను తీర్చినది. అల్యూమినియం, ఇత్తడి, రాగి మొదలగు చిల్లర ముడిసరకులతో నవీనమైన సరకులను తయారుచేయుటయే పరిశ్రమాశయము.

తయారుచేయు సంస్థ

## మైసూరు ప్రీమియర్ మెటల్ ఫ్యాక్టరి

అల్యూమినియం, ఇత్తడి, రాగి, తళతళలాడు ఉక్కు పాత్రలు తయారుచేయువారు.

తళతళలాడు సమస్తవిధములగు ఉక్కుపాత్రలు లభించును. "సన్ బ్రాండ్" ఉక్కుసామగ్రిలు నాణెముకు, పనితనమునకు ప్రసిద్ధి. దుమ్ముపట్టక చాలాకాలము మన్నును.

ఏ పాత్రనైనా కొనుటకు ముందు ఈ మార్కు చూడండి




సన్ బ్రాండ్ శుభ్రతకు నాణెముకు పెట్టినది పేరు.

ఆఫీసు ఫోను, 2535 గ్రామ్సు - సన్ బ్రాండ్. కార్యాలయము ఫోను, 3829

కార్యాలయము 124, మింటుస్ట్రీట్, మద్రాసు

కేశవలాల్ కే. షా. మేనేజింగుపార్ట్నరు

కార్యాలయము: తండియార్ పేట.

# లోకవార్తలు

పాటియాలా-తూర్పుపంజాబు సంస్థానములకు తాత్కాలిక మంత్రివర్గమేర్పడినది. అందులో తమకు స్థానము కావాలనికోరుచు పాటియాలా స్త్రీ సభవారు తీర్మానించారు. సంస్థానముల ప్రభుత్వంవారు స్త్రీలకు విద్య నిర్బంధము, ఉచితముచేయమనికూడా కోరినారు.

♦ ♦ ♦ ♦

1948 జూన్ ఆఖరుకు చీనా జనాభా 4640 లక్షలు అని తేలినది. షాంఘైపట్నంలో 45 లక్షలకు మించి ఉన్నారట. చీనారాజధాని పట్నమైన నాంకింగ్‌లో 10 లక్షలే.

♦ ♦ ♦ ♦

మాహిపట్నం మనదేశంలో ఫ్రెంచివారి అధీనంలోనున్న వానిలోనొకటి. అక్కడ నలుగురు పెద్ద మనుష్యులు గతసం|| ము మెట్రిక్యులేషన్ ప్యాసుకాలేకపోయినారు. ఈ సం||ము వారివయస్సు రూల్సు ప్రకారం పరిమితిదాటింది. అందుచేత వారిని తిరిగీ స్కూలులో చేర్చుకోలేదు. వారు మొండిగావచ్చి క్లాసులో కూర్చున్నారు. పోలీసులువచ్చి అవతలికి పంపారు. మిలిటరీవాళ్లు స్కూలు కాపలా కాస్తున్నారు. పోలీసులు, మిలిటరీ జోక్యం తీసుకున్నారని పిల్లకాయలు క్లాసులకు పోవడం మానారు. దాంతో అధికార్లు, పాఠశాల నంతులేకుండా మూసేశామన్నారు. ఇంతకూ కారణమైన ఆ నలుగురిలో ఇద్దరు రోడ్డు మీద పోలీసులను తిట్టారని అరెస్టుకాబడి విచారణలోనున్నారు - మొద్దబ్బాయిలు చూడండి—ఎంతపని చేశారో !

♦ ♦ ♦ ♦

లండన్‌లో పావా అనే 36 సం||ల బర్మాయువకుడు వంటవాడుగానున్నాడు. అతడొక్కరోజున కులాసావేసి-ఒక ఆంగ్ల బాలికను - 10 నిమిషాలపాటు కాలిబంతిని తన్నినట్లు, గదిలో అటూ ఇటూ తన్నినాడట. అందుకని అతనికి ఒకనెల ఖైదుశిక్ష విధింపబడినది.

♦ ♦ ♦ ♦

మద్రాసు చాకలిపేటలో ఒక జట్కావాడు దురుసుగాతోలితే చిన్నబిడ్డ దానిక్రిందబడి చచ్చి

పోయినది. ఆ అరకొర ఊపిరితో ఉన్న శిశువు నెవ్వరో ఎత్తి తండ్రిచేతిలో పెట్టితే, అతడు తప్పత్రాగి ఉండి నేలకేసి కొట్టినాడు. ఇద్దరినీ విచారణచేసి ప్రెసిడెన్సీ మ్యాజస్ట్రేటు-జట్కా-వానికి 3 సం॥లు శిక్ష వేశాడు. తండ్రి తప్పిదానికి జుల్మానా లేకపోతే 3 వారాలు ఖైదువిధించాడు. "బండ్లవాళ్లు జాగ్రత్తగ నడపవలసినదే, కాని తలిదండ్రులున్నూ తప్పకోతేని బిడ్డలను వీధులలో తిరగనీయరాదు" – అని మ్యాజస్ట్రేటుగారు తీర్పులో వ్రాశారు.

♦ ♦ ♦ ♦

జవహరిలాలు నెహ్రూ చెన్నపురిలో తమకు వేయబడిన పూలమాలలను కార్పొరేషన్ హెల్తుసెంటర్ "అశోకవిహార్"_నందలి బిడ్డల కిమ్మని ఇచ్చి వెళ్లినారు. ఆ సంస్థ చాలా బాగున్నదని ఢిల్లీలో ఆరోగ్య శాఖా మంత్రుల సభలో పొగిడారు.

♦ ♦ ♦ ♦

చెన్నరాష్ట్రప్రభుత్వంవారు మద్రాసు ట్రాంబళ్లలో మెట్లపైన-ముందువెనుక భాగాల ప్రయాణీకులు నిల్చుకోరాదు; కూర్చోరాదు_శిక్షిస్తాము అని ఒక సవరణచట్టం తేనున్నారు. ప్రతిరోజూ ప్రతిట్రాంలో జరిగేపనే ఇది.

♦ ♦ ♦ ♦

ఈ మధ్యకరైకుడిలో టెక్నలాజికల్ కాలేజీకి శంఖుస్థాపనచెయ్యర్వ నెహ్రూ వచ్చినప్పుడు ఆయనకు అందమైన దంతపుజాడీ బహూకరించారు. మంచిపనితనం దానిమీద చేయబడినది. దానిపై గాంధీ, రాజాజీ, నేతాజీ బొమ్మలు చెక్కినారు. ఈబొమ్మలకు ప్రతిదానికీ తలపై అందమైన కైవారములుకూడా చెక్కినారు. ఈ కైవారాలకుపైగా వేణుగోపాలమూర్తి, బుద్ధుడు, రామకృష్ణ పరమహంస, వివేకానంద స్వామి బొమ్మలు చెక్కబడినవి. ఆ కూజామూతమీద అశోకచక్ర చిహ్నితమైన భారతదేశపు పటమున్నది. ఈ కూజాను పొడుగుపాటి దంతాలుగల నాలుగు ఏనుగు బొమ్మల దిమ్మపై అమర్చినారు. ఆ దిమ్మ అంచున "తమసోమా జ్యోతిర్గమయ" అనే ఉపనిషద్వాక్యమును చెక్కినారు. ఆ కూజా కవతలిప్రక్కన అలగప్పచెట్టిగారికి ఈ అతిథియెడల గల గౌరవాతిశయంతెల్పె మాటలున్నాయి. కూజాలో ఎలక్ట్రిక్ బల్బు అమర్చారు. కూజాకుగల రంధ్రాలనుండి వెలుతురు జల్లులు పడుతుంటాయి.

♦ ♦ ♦ ♦

లండన్‌లో విశ్వవిద్యాలయానికి మొట్టమొదటిసారిగా - స్త్రీని ఉపాధ్యక్షపదవికి నియమించారు. ఆమెవయస్సు 51 సం॥ లు. 1930 నుండి—ఆమె బెడ్‌ఫర్డు కాలేజీలో అధునిక చారిత్రశాధ్యాపకురాలు. ఆమె ఆ పదవి వదలుకోకుండానే విశ్వవిద్యాలయోపాధ్యక్షపదవి నిర్వహిస్తుందిట. 1940 నుంచీ కూడా ఆమె సెనెటులో సభ్యురాలు. ఆమెపేరు ప్రొఫెసర్ లిల్లియన్. యం. పెన్‌సన్.

♦ ♦ ♦ ♦

ఇంగ్లాండులో ఈవ్ హార్డిమన్ అనేకన్యక 17 వ సం॥ న గుడ్డిదైనది. అప్పుడు పార్టుహాండు,

టైపు నేర్చుకొంటూ ఉండేది. కళ్లుపోయినతర్వాత లా చదవడ మారంభించింది. ఇటీవల్లనే బర్మింగ్‌హాము విశ్వవిద్యాలయంలో లా ఆనర్స్‌లో ప్యాసైనది. ఇంగ్లాండులో ఈ ఘనతపొందుట కీమెయే మొదటిది.



అహమ్మదాబాదులో పూర్వం కోతులబాధ పడలేక గాంధీగారిని సలహాఅగితే 'చేతనైతే, ఇష్టముంటే చంపేయండి' అన్నాడు. అట్లా అని అవి ఆయనపై ద్వేషించలేదు. ఆయన బోధలు, చర్యలు బాగా గమినించాయి. అనుకరణ కోతిపద్ధతిగదా. ఈమధ్య ఒకకోతి బిడ్డను కడుపునకరచుకొని ఈఇంటిపైనుండి ఆయింటిపైకిదూకుతుంటే - ఆబిడ్డజారి క్రిందపడ్డది. దానినెత్తుకొని దారిమార్గానవెళ్లేవాడు వెంటపెట్టుకొని పోయినాడు. కోతిబిడ్డ అయితేమాత్రం వదులుతుందా? ఆ కోతి నీరూ, ఆహారం మానేసి బిడ్డనువెతకడ మారంభించింది. "బిడ్డనుపోగొట్టుకొన్న కోతి ఆ మరణాంతోపవాసవ్రతం పూనింది" అని ఊరంతా వార్తప్రాకింది. పత్రికలవారు ప్రచురించారు. వేలకొలది వచ్చి చూడసాగినారు. దయామయులు ఆకోతి పిల్లనుతెచ్చి తల్లికిస్తే బహుమానమిస్తామనికూడా ప్రచురించారు. ఆ కోతిపిల్లఏమైందో? ఆ పట్టపగలు దొంగ ఏమైనాడో? దారిపోబడీలేదు. సప్తాహములు ఉపవసించి కోతి శ్రీరామ సాయుజ్యమందింది. శ్రీరామ, రామ!



పూనాలో తెలుగుమాట్లాడేవారికిగాను-ఆంధ్రసంఘము, ఆచంట శేషమాంబ తెలుగుగ్రంధాలయము 1-11-41 న నెలకొల్పబడినది. సభ్యులు అన్నికులాలవారు, మతాలవారు కలిసిమెలిసి ఉంటారు. తెలుగు ఇంగ్లీషుపత్రికలు చాలావస్తున్నవి. గ్రంధాలయంలో 800 తెలుగు ఇంగ్లీషుపుస్తకాలున్నాయి. ఈ సంస్థ వారు నాటకాలూ వేస్తారు. 1941 లో 150 మంది సభ్యులతో ప్రారంభమైనది, ఇప్పుడు 400 మంది సభ్యులు ఉన్నారు. దీనికొక భవనంకూడా కట్టించాలని వీరికోరిక. అందుకొరకు వితరణశాలురు విరాళము లంపండని కోరుచున్నారు. శక్తికొద్దీ తృణమో పణమో ఇవ్వదగిన సంస్థ.


## ఆగిపోయిన బహిష్టులు (TABLETS)

కుమారి (మాత్రలు) ఆగిపోయిన బహిష్టులను సక్రమంచేయును. ముమ్ముందు అలాంటి ఇబ్బంది రాకుండా చేయును. త్వరితకాలంలో నిరపాయకరమైన ఫలితాలనిచ్చును. వేలమంది సంతృప్తులైరి.

సమస్తవ్యాధులకు మాత్రల వెల రు. 3-0-0.

మొండివ్యాధులకు ప్రత్యేకమైన మందు వెల రు. 5-0-0

నివారణకాక జీర్ణించియుండు వ్యాధులకు మందు వెల రు.8-0-0 (వి.పి. 12 అణాలు అదనం.)

**Mrs. P. DEVEE** F. D. S. (G. L.)

Tollygunge : CALCUTTA.

*Stockists* —

హారీ & సన్స్, 93, చైనాబజారు రోడ్డు, మదరాసు.



భారత మహిళాసంఘం ప్రచురించే రోషిని పత్రిక

48 సం॥ జూలై, సంచికలో సంపాదకీయ వ్యాఖ్య:—

యునైటెడ్ స్టేట్సు ఆఫ్ అమెరికాలో ఈ సంవత్సరాంతమున అధ్యక్షుని ఎన్నికకు స్త్రీ అభ్యర్థులను నిలుపవలయునని ఒక క్రొత్త పార్టీ ఏర్పడినది. అది చాలామంచిపని. స్త్రీలకు స్వశక్తి తెలియవచ్చు చున్నదనుటకు శుభసూచన. అంతర్జాతీయముగా గల్గిన అవమానముల చిక్కు విడదీయుట మగవారి చేత గాదని ఆ స్త్రీలు గ్రహించినారు. అమెరికా స్త్రీలకు జయముగలుగుగాక! మగవారు శాంతి నెలకొల్పెదమని యుద్ధములు చేయుచున్నారు. యింకా ఎక్కువ యుద్ధములకు మూలమయ్యే శాంతిని నెలకొల్పుచున్నారు. యిట్టి విపరీతపద్ధతి నవలంబించి వారు పడుచున్న భంగపాటు చెప్పతరముకాదు. ప్రపంచరంగములో సాంఘికముగా, రాజకీయముగా ఎంతైన కృత్రిమమూ మోసము జరుగుచున్నవి. దానివల్ల ఆంతరంగికముగా శాంతిగాని రాజ్యాలమధ్య అంగీకారముగాని అంతర్జాతీయముగా సౌహార్దముగాని అశక్యమయినది. కావున వీటినన్నింటిని ప్రపంచరంగమందు తుడిచివేయవలెను.

92సం॥ల వృద్ధు-జార్జి బెర్నార్డుషా కవి ఏమంటున్నాడో-ముఖ్యంగా స్త్రీలుగ్రహించాలి:-

స్త్రీలు, పురుషులు ఎందుకు ఊరక మొగానికి సబ్బురుద్దుకుంటారు? దానివల్ల కండ్లకు, ముక్కుకు, నోటికి - అన్నిటికీ చెరుపే! దానికివెరిచే బిడ్డలు స్నానమంటే అసహ్యించుకుంటారు. నేను మాత్రం చల్లటినీళ్ల బేసిన్‌లో కళ్లు బాగాతెరుచుకొని చెవులుమునగ మొగముంచి కళ్లు చెవులు మొగము వట్టిచేతులతో రుద్ది కడుగుతాను, అవతల పొడితుండుగుడ్డ పెట్టి తుడుచుకుంటాను.

యగర్ట్ సతి సర్ స్టాఫర్డుక్రిప్స్ పెద్దక్క. ఆమెభర్త లండన్ రాయల్ సొసైటీ కార్యదర్శి. ఆమె భర్త బెంగుళూరులో సైన్సు ఇన్‌స్టిట్యూట్‌ను దర్శించను వస్తుంటే ఆయనతో వచ్చింది. ఆమె ఉదకమండలంలో హిందూవిలేఖరితో ఇలాఅన్నది:-

భారతదేశము చాలా అద్భుతమైనదేశం. స్వాతంత్ర్యం వహించిన తర్వాత చాలా బాగా ముందుకు సాగిపోతున్నది. ఈదేశానికి నాతమ్ముడు గొప్పస్నేహితుడు. మేమిక్కడ సంతోషకరంగాను ప్రయోజనకరంగాను కాలంగడుపుదామని ఆశిస్తున్నాము.

వేరొకచో ప్రచురించిన వరలక్ష్మీవ్రతం పాటను శ్రీమతి నంబూరు రామ తిలకమ్మగారు తమఇంట్లో పాడుకొనేది అని వ్రాసిపంపారు. అందులో "వాసిగ శ్రీ చెన్నపురిన వెలసితివమ్మ" అని ఉన్నది. చెన్నపురి వరలక్ష్మీమయం కావడంలో విశేషంలేదు. ఆమె తెలుగు వరలక్ష్మి యేమో అని మాకు కుతూహలంవేసి —— "ఏమమ్మా ఈ పాట, మీ పుట్టింటినుంచీ నేర్చుకొని వచ్చారా - చెన్నపురిలోనే పుట్టిందా" అని అడిగాము. దానికామె వ్రాసిన జవాబు:-

శ్రావణశుక్రవారంపాట మాజేజెమ్మగారువాండ్లు పాడుతూయుండినది. ఈపాటను సాధారణంగా శ్రావణశుక్రవారం వరలక్ష్మీవ్రతంరోజున తప్పనిసరిగా పాడుతుండేవారు...... మేము చాలాకాలంగా మాఅత్తగారువారు, తల్లింటివారు, మాఅవ్వగారు వాసాశాలయ్యశెట్టివారు మద్రాసులోనేయుంటున్నాము.

♦ ♦ ♦ ♦

లోకం పోకడననుసరించి - ఇంతకాలం 'కేవలం పురుషుల కృత్యాలు' అనబడేవి స్త్రీలు నిర్వహిస్తూ, ఇన్నాళ్లు 'ఆడపనులు' అనబడేవికూడా చక్కబెట్టాలిసిందే అంటే - ఆపరిస్థితుల్లో, సంఘమునందు కొన్ని తీవ్రమైన మార్పులుత్వరగా జరగాలి.... దాన్ని అనుసరించే విద్యావిధానంకూడా ఏర్పాటుకావాలి. గృహనిర్వహణ శాస్త్రము, శిశుపోషణ కౌశల్యం - అందరికీ చెందిన విద్యావిధానంలో చేర్చాలి. మరి అవసరమైతే, స్త్రీతోపాటు పురుషుడున్నూ ఆయాపనులు బాధ్యతవహించి నిర్వహించాలి. లేకపోతే, ఇంటా బయటా రెండురంగాలా పాటుపడమని స్త్రీని నిర్బంధించడమైనా అవుతుంది; కాకపోతే ఊపిరాడకుండా తాయిమెడకుగట్టి, పిల్లలను కాళ్లకుచుట్టి విముక్తిలేకుండా పట్టిబంధించడమైనా అవుతున్నది. విద్యావంతురాండ్రెందరో పెళ్లికాగానే, చదువు సంధ్యలు కట్టిపెట్టుతున్నారు; లోక వ్యవహారాలు మానేస్తున్నారు; తిరిగీ, చదువురానివారి జట్టులో చేరుతున్నారు. వారికి ప్రజా సమస్యలన్నా, బాహ్య వ్యవహారాలన్నా ఆపేక్ష చచ్చిపోతున్నది. ఇంతకు ప్రపంచమంటే ఏమిటి-ఇంటిప్రతిబింబమే. తెలివిగల స్త్రీ సహకారం ఇంట్లో ఎంత అవసరమో బయటా అంతే. కాబట్టి స్త్రీ పురుషులెల్లరులు, ఒండొరులకు తోడ్డై పనిచేయాలి, అప్పుడే సంఘంవృద్ధికివచ్చేది.

కమలాదేవి చటోపాధ్యాయ.

---


# ఏజంట్లు కావలయును.

"గృహలక్ష్మి" మాసపత్రికలు విక్రయించుటకు - చందాదార్లను చేర్పించుటకు ఈదిగువ, స్థలములలో ఏజంట్లు కావలయును.

ఇచ్ఛాపురం; సోంపేట; పాలకొండ; బొబ్బిలి; సాలూరు; చీరాల; కందుకూరు; గిద్దలూరు; కంభం; నర్సారావుపేట; పాలకొల్లు; అమలాపురం; జగ్గయ్యపేట.

వివరములకు:

'గృహలక్ష్మి' కార్యాలయము,
15, వెస్టుకాట్ రోడ్డు,
రాయపేట, మద్రాసు.

# సంపాదకీయములు

## శ్రీ రాజాజీకి స్వాగతం

భారతయూనియన్ ప్రథమభారతీయ గవర్నరు జనరల్ పదవినందిన శ్రీ రాజాజీగారు ఈ నెలాఖరున మన ప్రాంతానికి వస్తున్నారు. కాబట్టి "గృహలక్ష్మి" వారికి హృదయపూర్వకమైన స్వాగతమిస్తున్నది. శ్రీవారు స్వరాజ్య సంపాదనకై వయసు ప్రొద్దుతిరిగిన తర్వాత-అష్టకష్టాలు పడినవారు. వారికాలంలోనే మనకు స్వరాజ్యం రావడం, వారు ఆప్రభుత్వంలో రాష్ట్రాధిపతులకెల్ల అధిపతి కావడం సంతోషదాయకమైన సంగతి. శ్రీవారి జీవితగాథలో ఒక విశేషమున్నది. వారు చిన్నతనంలోనే సంపాద్యపరులై అష్టైశ్వర్యాలు చక్కగా అనుభవించారు. నడిప్రాయంలో వారి "గృహలక్ష్మి" స్వర్గమలంకరించిందట. వారికి జీవితము నిస్సారమనితోచి వైరాగ్యమువైపు మ్రొగ్గుకల్గినదట. అయితే అస్వర్గస్థురాలు—ఆడమగబిడ్డల నప్పచెప్పి వెళ్లింది. "గృహలక్ష్మి"లేమి ఇల్లు, హృదయం — శూన్యమై బావురు మంటుంటే — ముసురుకొంటూన్న వైరాగ్యమును చేతులత్రోసివేసి—ఆ బిడ్డలకు తల్లీ తండ్రీ తానే అయి-సాకి పెంచి పెద్దచేశారు. కాబట్టి - ఆ విచిత్ర పురుషుని అంతరంగంలో - మాతృభావము - 30 సం॥లుగా సాధనచేసిన మాతృభావము - నిండి నిబిడీకృతమై యున్నది సుమా! సరీగా - అలాంటి సంధి సమయంలోనే మహాత్ముని పరిచయం, శిష్యత్వము, సచివత్వము, సంబంధం - అన్నీ వరుసగా వారి కమరినవి. కాని తిరిగీ వారి జీవితంలో ఇదీ వక సంధికాలం. వచ్చిన స్వరాజ్యమా దేశవిభజనతో కూడిఉన్నది. దానివల్ల పుట్టిన ఉత్పాతాలున్నూ దుర్భరమైనవి. జిన్నానెలాగైనా సమాధానపరుద్దామని తానొకసారి అన్న దోషానికి కొందరైనా తన్ను దుయ్యపడుతున్నారు. ఈ 30 సం॥లుగా తనజీవితంలో అన్నిఅవస్థలా చొచ్చుకొన్న గాంధీమహాత్ముడు దుర్మరణమునందినాడు. తన "గృహలక్ష్మి" తన కప్పచెప్పి వెళ్లిన బిడ్డలా రెక్కలువచ్చి వారి తంటాలు వారు పడుతున్నారు. వయస్సు అస్తాద్రిని చుంబిస్తూ పండబారిన వైరాగ్యమును కప్పుకుంటున్నది. ఇట్టి సమయంలో వారిని అత్యున్నతాధిపత్యం వరించింది. ఈ సందర్భంలో "గృహలక్ష్మి" కోరేదేమంటే నాడెట్లా నిజసంతానపు శ్రేయః ప్రేయములుకోరివైరాగ్యమును వెనుకకు త్రోసివేసుకొని కర్మయోగి అయినాడో, అలాగే భారత భవిష్యత్సంతానముల కభ్యుదయపరంపరల నాశించి - శ్రీవారు ఈ పదవిని మనోవాక్కాయకర్మలా నిర్వహిస్తారుగాక - అని. ఆంధ్రనారీమణులందరితరపున శ్రీవారికి హృదయపూర్వకమైన స్వాగతం.

## పబ్లిక్ స్థలాలలో బూతుబొమ్మలు

ఇటీవల దక్షిణభారత రైల్వేఅధికారులు ఒక ప్రకటనచేశారు. ఎలక్ట్రిక్ రైళ్లలో సీరాచిమ్మడం, కుషన్లు చించడం, బూతుబొమ్మలు, బూతుకూతలు వ్రాయడం మొదలైన దుండగాలుచేసి రైలుపెట్టెలను నష్టపరచడం, అసహ్యపరచడం తగదని ఆప్రకటనలో హెచ్చరించబడినది. మిగతా అన్ని అట్లాఉంచి-బూతుబొమ్మలు, బూతుకూతలు విషయమే ఇక్కడ ప్రస్తావనచేస్తున్నాను. ఇది ఒక్క ఎలక్ట్రిక్ రైళ్లకు, దక్షిణభారతరైళ్లకు సంబంధించినదే కాదు. అన్నిరైళ్లకు సంబంధించినదే. ముఖ్యంగా వాని పాకీదొడ్లలో వ్రాయబడే మాటలు, ఉచ్చరింపదగినవిగా ఉండవు. వేసేబొమ్మలు కన్నెత్తిచూడదగినవిగా ఉండవు. మానవతియైనస్త్రీ ఆలోపల ఒక్క నిమిషముండజాలదు. ఈ పనులు హోటళ్లగదులలోను చేస్తుంటారు, పబ్లిక్

పాకీదొడ్లలో చేస్తారు. అక్కడ, ఇక్కడ ఏమిటి? తెల్లనిగోడ, నల్లనిబొగ్గు దొరికితేచాలు, అటుఇటుచూచి ఏదో గీచిపోతారు. ఈ బొమ్మలు వేసేటప్పుడు, ఈ వ్రాతలు వ్రాసేటప్పుడు వాటిని తమ అక్కచెల్లెండ్రు చదువుతారని, చూస్తారని వారికి స్పృహఉంటే బాగుండును. అప్పుడవి వ్రాయరు. చాలావరకు వీరు వీనిని రహస్యంగా చేస్తూంటారు. కాబట్టి పట్టుబడరు. అయితే ప్రయాణీకులు మొదలైనవారు కొంత జాగ్రత్తగ ఉంటే కొంతమందైనా పట్టుబడతారు. కాని ఆ చేసేవారికి, చేస్తూంటె చూచేవారికి ఇన్నాళ్లు ఒకభావంఉండేది. మనం బానిసత్వంలో ఉండడంచేత - ఇతరులుమనపై పెత్తనంచేయుచుండుటచేత, ఈ ఆస్తిఅంతా వాళ్లదని, ఇదిచెడిపోయినా, వికారమైనా ఫరవాలేదని వారికనిపించేది. నిజానికినాడు, స్వాతంత్ర్యం వచ్చినతర్వాత నేడుకూడా - పబ్లిక్, ప్రైవేటుఆస్తులలో ప్రతి అణువున్నూ దేశీయసంపదే. దానిని నష్టపరచడం దేశానికి నష్టమే. కాబట్టి ప్రజలు ఇలాంటి దుర్మార్గాలను సహింపరాదు. మనకెందుకని ఊరుకోరాదు. గట్టిగా వాళ్లనుచీవాట్లు పెట్టవలెను. ప్రభుత్వమున్నూ దీనిని శిక్షార్హంచేసి-నేరస్థులనుపట్టి శిక్షించే ఏర్పాట్లుచేయాలి.

## హిందూ లా సవరణ బిల్లు

భారతయూనియన్ శాసనసభగా వ్యవహరిస్తున్న కాన్‌స్టిట్యూయంట్ అసెంబ్లీవారు హిందూ లా సవరణబిల్లు ప్రవేశపెట్టి దానిని సెలెక్టుకమిటీ కంపినారు. సెలెక్టుకమిటీవారి రిపోర్టునిప్పుడు తిరిగి శాసనసభగా వారుయోచించి నిర్ణయించవలసియుండెను. అయితే - దానిని వాయిదావేయదలచినారట. ఇప్పుడు దానిని వాయిదావేయుట ఏలనయ్యా అంటే - ఈసభ్యులు కేవలము రాజ్యాంగచట్టమునిర్మించుటకే ఉద్దేశింపబడినారట. ఈ బిల్లువల్ల హిందూ లా లోనున్న కొన్నిలోట్లు సవరణయగును. ముఖ్యముగా స్త్రీలకు కొన్నిఆస్తిసంబధమైన హక్కులుఏర్పడుచున్నవి. ఇట్టి చట్టమునొనర్చుటకు వీరుపూనరాదట. దేశముయొక్క రాజ్యాంగధర్మమునే నిరూపింపగలువారీ సవరణచట్టము చేయుసమర్థులు కారా? మిగత అన్నిచట్టములను యోచించి నిర్మించుటకు వీరికిగల విశేషాధికారమేమి, దీనికైలేనిదేమి? ఇట్టి బిల్లును వాయిదావేయుట స్త్రీ సంఘములును, స్త్రీజన శ్రేయోభిలాషులును ఖండించదగును.

## హిందీ వ్యతిరేకాందోళనం

మనతమిళసోదరులు కొందరు హిందీవ్యతిరేకాందోళనము నారంభించారు. ఇంతకన్నా తెలివితక్కువ ఇంకొకటి ఉండబోదు. విడిపోయిన పాకిస్థానం విడిపోయినా - ఉన్న భారతయూనియన్ ఐనా పొరపులులేకుండా కలిసి ఉండాలంటే మాటా మంతి అందరికీ కలియవలెను. అందుకు ఏకభాషముఖ్యము. మాతృభాషలు అవశ్యకమే. అయితే ఈరెండూ అక్కచెల్లెండ్రుకాని సవతులుకావు. ఈ విషయంలో ఉత్తరదేశపురాష్ట్రలకన్నా - దక్షిణదేశపురాష్ట్రలు జాగ్రత్తపడవలె. పూర్వము - దేశభాషఅయిన సంస్కృతం నేర్చిఉండడంచేతనే దాక్షిణాత్యులు, తెలుగు, తమిళ, కన్నడ, మళయాళపుతల్లులుగన్న బిడ్డలు. శంకర, రామానుజ, మాధ్వాచార్యులు, వల్లభాచార్యులు యావద్భారతదేశం పర్యటనంచేసి పూజలనందారు, పండితులను గెల్చినారు. మతాలు నెలకొల్పారు. బాణుడు భారవి, భవభూతి, మల్లినాథుడు, అప్పయ్యదీక్షితులు, పండితరాయలు, ఇత్యాది కవులు వ్యాఖ్యాతలు - దేశమంతటా మన్ననలందినారు. విశిష్టాద్వైతమత ప్రవిష్టులైన ఆసూరి కేశవభట్టుకుమారులు, లక్ష్మణభట్టువారు (శ్రీ రామానుజులు) మొదట సంస్కృత పండితులైనమీదటే - 'పల్లాండు' నేర్చారని చాలామంది ద్రావిడులకు తెలియదేమో! తమమగవారు ఈ పిచ్చివేషాలుమాని, తమబిడ్డలు హిందీనేర్చుకొని యావద్భారతరంగంలో అందరితో సరిసమానంగా వ్యవహరించగల నేర్పు సంపాదించునట్లు మా సోదరీమణులు కృషిచేయాలి.

—:0:—




## బాల

"బాల"కు మూడు సం॥లు నిండి 4 వ సం॥ర మారంభమైనది. అందుచేత ఈ ఆగస్టు సంచిక ఆ పుట్టినరోజు పండుగ చిహ్నంగా బాలల కాప్యాయమైన మిఠాయి సంచిక. నాల్గవఏడు వచ్చింది అని "బాల" చిరుబొజ్జపై జారె పట్టుధట్టీగట్టి, కస్తూరీ తిలకము పత్రస్థవతికములతో, చిరునవ్వులు వెదజల్లుతూ, పట్టుకుచ్చుల స్వాతంత్ర్యపతాకం ఎడమచేత ఎత్తిపట్టి, వేగానికి పేరుపొందిన మూడు కుందేళ్లుగట్టిన నాలుగు చక్రాలబండిమీద స్వారి చేస్తున్నట్లుంది — ముఖచిత్రం. ఆ "బాల"కు-సహస్ర దళపద్మం గొడుగుగా అమరిఉంది. "బాల" జన్మదినోత్సవానికి - కుమారస్వామి వాహనమైన నెమలి పురివిప్పి బాట ప్రక్కన నృత్యం చేస్తున్నది. 'లోపలంతా — మిఠాయిసంచికకు తగినబొమ్మలు, కథలు, తమాషాలు, మంచి షల్లగతులు, పద్యాలు, పాటలు ఎన్నోఉన్నాయి. నాలుగేళ్లు వచ్చినా ఇంకా "బాలకు" ఆటలు పాటలూ, కథలూ బొమ్మలూనేనా? ఏవన్నా పాఠాలు, జాగ్రఫీ, లెక్కలు అల్లాంటివి ఉండాలికాని అని ఛాందసులు అనవచ్చు. కాని ఆటపాటలతోనే "బాల"లకు చదువు సంధ్యలు సాగాలని 'మాంటిసరి పద్ధతి' చెప్పుతున్నది. ఇంతకూ ఈ "బాల" ఎన్నేళ్లు వచ్చినా — ఎదిగి బిరుసుపారే రకంకాదు; బాల గోపాల


**దేశాయిగారి**
**వనితాజీవన్**

ఋతుశూల శ్వేత రక్తప్రదరములను, ఋతుబద్ధము, అజీర్ణము, అరుచి, నడుమునొప్పి, తలనొప్పి, వ్రణములు, మున్నగు స్త్రీల గర్భాశయ వ్యాధులన్నిటిని పోగొట్టి, మంచిబలమును కలిగించును - స్త్రీలపాలిట వరప్రసాదిని ప్రసిద్ధిగాంచినది.

గుడివాడ ఆంధ్రరాష్ట్రీయ ఆయుర్వేద వైద్య మహామండలి వైద్యరాజు, ఎల్. భీమేశ్వర రావుగారు వ్రాయుచున్నారు:- మీ యొక్క వనితాజీవన్ ఋతుసంబంధమైన వ్యాధులచే పీడింపబడు స్త్రీలకు వాడగ, చాలా అద్భుత గుణములిచ్చినదని తెలుపుటకు చాలా సంతోషించుచున్నాము. తీరనివ్యాధులుకూడ యిందువల్ల గుణంపడినవి.

మా ఏజంట్లు :-

1. శ్రీ చంద్రమౌళీశ్వర్ అండు కంపెని, బెజవాడ
2. ఆంధ్రభారత మెడికల్ స్టోర్సు, చింతలపూడి
3. ఇ. యం. శర్మ అండు సన్సు, ముమ్మిడివరం
4. ప్రభాత్ మెడికల్ స్టోర్సు, గుడివాడ
5. సత్తెనపల్లి మెడికల్ స్టోర్సు, సత్తెనపల్లి
6. K. V. మాణిక్యారావు, బందరు
7. ఆర్యన్ ఫార్మశీ, నెల్లూరు
8. సాంబశివ మెడికల్ స్టోర్సు, ఏలూరు

ఏజంట్లు:- **దామోదర్ అండ్ కంపెని,**
ఆఫ్రికన్ షాపు బిల్డింగ్సు-బెజవాడ.

కృష్ణమూర్తివలె, బాలాత్రిపురసుందరివలె "నిత్యబాల"యై-ఆటపాటలతో-కథలూ కార్ఖానాలతో-అందం ఆనందం తాననుభవిస్తూ ఇతరబాలలకు పంచిపెట్టే - ప్రకృతి. సంవత్సరమున కొక్కసారికాదు, ప్రతి నెలా మిఠాయి పంచిపెట్టుతూ వర్ధిల్లవలె. వెల రు. 1-0-0. ఏ పత్రికలమ్మే వాళ్లవద్దైనా దొరకుతుంది. వారి ఆఫీసు 29, సుందరేశ్వరవీధి మైలాపూరు 4.

## పరిశ్రమ

శ్రీ కోడే అప్పారావుగారు సంపాదకులుగా, ప్ర. రాధాకృష్ణమూర్తిగారు గౌరవ సంపాదకులుగా విజయవాడనుండి వెలువడుచున్న నూతన "పారిశ్రామికుల తెలుగుమాసపత్రిక" ఈ పత్రిక హెచ్చుగా అభిమానించునది కుటీర పరిశ్రమలు. 'గృహలక్ష్మి' కుటీరపరిశ్రమలను ప్రేమించును, అవి కనియే బ్రతుకు తెరువు చూపునవి. అయితే భారతీయప్రజ కుటీరపరిశ్రమలతో 'గుడుగుడు గుంజము' లాడేరోజులు గతించినవి. యాంత్రిక పరిశ్రమలయందభిమానము, అభిలాష తెలుగువారియం దిట్టి పత్రికల ప్రచారము చేయతగును. విడిపత్రిక ధర 0-3-0. మూర్తి క్రౌన్ 1/8 6 పుటలు. వలయువారు విజయవాడ పత్రికా కార్యాలయమునకు వ్రాయండి.

## హితవాద

ఇది శ్రీ కె. యస్. ఆర్. శాస్త్రిగారి సంపాదకత్వమున వెలువడుచున్న జాతీయ సచిత్రమాస పత్రిక. సంపాదకులు శతావధానులగు కోటసోదర కవులందు పిన్నలు. కవులు సంపాదకులు కావున పత్రిక కవితాపరిమళమును గుప్పుచున్నది. వీరున్నూ స్త్రీ సమస్యలకు సంబంధించిన వ్యాసాలకు ప్రాముఖ్యత నివ్వ దలుచుకోవడం సంతోషింపదగినది. ఈ పత్రికయు బాలసంఘాల నేర్పరచి వారికి ప్రబోధముచేయ నెంచు తున్నది. హితవాద కార్యాలయములో అందుకొక "అక్కయ్య" పూనుకొన్నది. ఇందులో ఆర్డినెన్సు విమర్శిస్తూ "పోలీసులకు మిక్కిలి అధికారాలిచ్చేముందు వారిలో కలుపుతీసివేయండి" - అని భయంకరాచారిగారు వ్రాసిన వ్యాసం బాగుంది. అయితే వారు వ్యక్తులతో మాట్లాడినప్పుడు ప్రైవేటు ప్రసంగము ఏదో, పబ్లిక్ ప్రసంగమేదో-విడదీసుకోవాలి. ప్రచురించేటప్పుడు గమనించాలి అని మా సలహా. ఇందులో మంచి చిత్రాలూ ఉన్నవి; చెప్పనేల-సినిమా చిత్రాలూ ఉన్నవి. అన్ని పత్రికలూ-హిందూసహా-బాగడే "చంద్రలేఖ"ను వీరు చిన్నచూపు చూస్తున్నారు. సంపాదకీయంకూడా చక్కగా ఉన్నది. దీనిపేరు ఏమో 'హితవాద', 'హితవాద'ము తియ్యగా, మృదువుగా ఉండాలి. కాని నన్నయభట్టుగారేమో బ్రాహ్మణ వాక్కు "దారుణాఖండల శస్త్రతుల్యము" అన్నారుమరి! చిరంజీవి శాస్త్రి సంపాదకత్వమున వెలువడిన "హితవాద" చిరంజీవియై వర్ధిల్లుగాక. సం॥ చందా రు 5-0-0 లు. వలయువారు 93, వరదా ముత్తియప్పన్ వీధి, మద్రాసు 1. అని వ్రాయుడు

## తెలుగు స్వతంత్ర

ఇంగ్లీషు స్వతంత్రను రెండు సం॥లుగా నడుపుచున్న శ్రీ ఖాసా సుబ్బారావుగారు క్రొత్తగా "తెలుగు స్వతంత్ర" అని ప్రారంభించిన సచిత్ర వారపత్రిక ఇది. సంపాదకులు శ్రీ సుబ్బారావుగారే. సుబ్బారావుగారి రచనా కౌశలం చెప్పనక్కరలేదు. సిద్ధహస్తులు వారా పనిలో. ప్రథమ సంచిక సుందరంగానూ ఆకర్షణీయంగానూ యున్నది. ప్రజాభిప్రాయమును వ్యక్తపరచడం దాన్ని తీర్చి దిద్దడం - ఈ రెండు పనులూ ఉత్తమ పత్రికా ధర్మాలని నిర్వచించి-ఈ రెండు కార్యాలు మేము నిర్వహిస్తాము అని సంపాదకులు తమ సంపాదకీయంలో వ్రాశారు. అందుకు సుబ్బారావుగారు సమర్థులని పైననేచెప్పినాము. మొత్తానికి ఈ నాటి తెలుగువారపత్రికలలో ఉత్తమ శ్రేణిలో నిది వెలుగగలదని ఆశిస్తున్నాము. విడిపత్రిక రు. 0-4-0. కార్యాలయు. 156, లాయడ్స్ రోడ్డు, మద్రాసు-14.

## ఉపాధ్యాయ

ఆంధ్రరాష్ట్ర ప్రాథమికోపాధ్యాయ ఫెడరేషన్ మాసపత్రిక

పత్రిక తెరవడంతోటే-ఉపాధ్యాయుల జీతాలు చాలవనేగోలో, ఏ మాంటిసరీ పద్ధతినిగూర్చి దీర్ఘ వ్యాసమో ఉంటుందనుకున్నాను. నాలుగు కలు తిరగవేసేసరికి చాలీచాలని జీతాలబడిపంతుళ్ల పత్రికా-ఇది అనిపించింది. తిరిగీ ఒక్కసారి పైనజూచి లోపలచూడగానే శాసనపట్టగలిగాను. ఈ రోజుల్లో అది అత్తల కాంగ్రెస్సూ, కోడళ్ల ఫెడరేషనూ కానివ్వండి; రాచ్చిప్పల ఫెడరేషనూ, గరిటెల కాంగ్రెస్సు కానివ్వండి - "కాంగ్రెసు" అనేతోక ఉంటే - అది కాంగ్రెసు వారిచేలా; 'ఫెడరేషన్'— అనేతోక వుంటే-కమ్యూనిస్టుచేలా. వ్యాసాలూ మాఅనుమానాన్ని బలపరిచాయి. బడిపంతుళ్లు ఈ గోలలన్నిమాని తమబాగు, తమ కప్పచెప్పబడ్డ బిడ్డల చదువు చూచుకోవడం ఉత్తమం. అందుకు తగినట్టు పత్రికలు నడిపితే హితకరం. సం॥ చందా రు 3-0-0. వలయువారు-పత్రికా కార్యాలయానికి కొత్తపేట, గుంటూరు అని వ్రాయండి.

వెం


# ఆరోగ్యం—ఆనందం

పాపలకు కావలసినవి ఈరెండే

సాధారణంగా పాపలకు జీర్ణశక్తి మందంగావుంటుంది. ఆహారం ఏమాత్రం ఎక్కువ తిన్నా, లేక, తిన్న ఆహారం సరిపడకపోయినా అజీర్ణం, కడుపునొప్పివస్తుంది. అట్టి సమయములలో పాపాయిలు ఏడుస్తారు. తెలివిగల తలిదండ్రులు ఇదిగ్రహించి

పాపలకు **జేమ్సు గ్రైప్-స్టాప్ వాటర్**ను ఇస్తారు.

తియ్యగా, రుచిగావుండు ఈ గ్రైప్‌వాటర్ పాపల పాలిటి అమృతమే!

వివరములకు:

**జేమ్సు పెర్ఫ్యూమరీ కంపెనీ**

1/5, వ్యానల్సు రోడ్, ఎగ్మోర్, మద్రాసు-8.




**James GRIPE-STOP WATER**

JAMES CHEMICAL LABORATORIES, MADRAS.

## శ్రీ సర్వధారినామ సం॥ర శ్రావణ భాద్రపద మాసములు.

| | | | |
|---|---|---|---|
| ఆగష్టు | 16 | సో | ద్వా. 27-33 పూ. షా. 40-37 ది. 2-31 సోమశివాభిషేకోత్సవం. |
| | 17 | మం | త్ర. 30-18 ఉ. షా. 45-11 రా. 24-3 భౌమశాంకరి వ్రతం. [దామోదర ద్వాదశి. |
| | 18 | బు | చతు. 34-12 శ్ర 50-49 శే త్యా 0-40 ఋగ్వేదినూతన వటూపాకర్మ వరాహజయంతి |
| | 19 | గు | పౌ. ○ 38-42 ధ 50-59 ది. 1-40 యజుర్వేదినూతన వటూపాకర్మ. హయగ్రీవా [వతారః స్త్రీణాం చంద్రదర్శనం. |
| | 20 | శు | బ. పా. 43-52 శత. 60-0 ది. 17-1 సంపల్లక్ష్మీవ్రతం. |
| | 21 | శ | వి. 48-45 శత. 3-32 ది. 21-6 శ్రావణ శనివారవ్రతం శ్రీమంత్రాలయ [రాఘవేంద్రతీర్థ పుణ్యదినం. |
| | 22 | ఆ | తృ. 53-42 పూ. భా. 10-2 రా 5-3 |
| | 23 | సో | చ. 57-16 ఉ. భా. 15 52 రా. 16-50 సంకష్టహరణ గణేశవ్రతం |
| | 24 | మం | పం. 60-0 రే. 20-50 కుశగౌరీవ్రతం. |
| 1948 వ సం॥ | 25 | బు | పం. 0-18 అశ్వ. 24-47 ది. 14-5 నందికేశ్వర వ్రతం |
| | 26 | గు | ష. 1-32 భ. 27-39 రా. 27-0 |
| | 27 | శు | స. 1-52 కృ 29-0 స్మార్తమాధ్వ కృష్ణాష్టమీ భాగ్యలక్ష్మీవ్రతం. |
| | 28 | శ | అ. 0-56 ఉప॥ న 58-16 రో 29-33 శ్రీవైష్ణవ శ్రీకృష్ణజయంతి శ్రావణ [శనివార వ్రతం. |
| | 29 | ఆ | ద. 55-49 మృ. 28-9 రా. 17-14. |
| | 30 | సో | ఏ. 51-39 ఆర్ద్ర. 26-12 రా. 24-9 స్మార్తానామేకాదశి. |
| | 31 | మం | ద్వా. 46-34 పున. 23 37 రా. 11-23 కుజగౌరీవ్రతం. వైష్ణవానామేకాదశి. |
| | 1 | బు | త్ర. 40-51 పుష్య 20-7 రా 19-4. |
| | 2 | గు | చతు. 34-3 ఆ. 16-11 రా. 13-6 మాస శివరాత్రి. |
| | 3 | శు | అమా ● 28-41 ది. 30-47 సౌభాగ్యలక్ష్మీవ్రతం. అమాతర్పణం. |
| | | | భాద్రపద మాసం |
| | 4 | శ | శుద్ధపాడ్యమి. 22-29 పూఫ 7-59 తిథిద్వయం శైవమౌనవ్రతం. |
| | 5 | ఆ | వి. 16-40 ఉఫ. 3-58 ది. 23-34 తృతీయాతిథి, బలరామ కల్కి జయంతి. |
| | 6 | సో | త. 11-16 హ. 0-20 ది. 19-4 శ్రీసర్వసిద్ధి వినాయకవ్రతం పరశురామజయంతి. |
| సెప్టెంబరు | 7 | మం | బ 6-20 స్వా 54-30 ఋషిపంచమీ బుద్ధజయంతి. |
| | 8 | బు | పం. 2-14 ఉప॥ షష్ఠి 56-47 వి. 53-4 ది. 8-9 గౌరీవ్రతం సూర్యషష్ఠి. |
| | 9 | గు | స. 56-49 అను 52-34 అముక్తాభరణ సప్తమీవ్రతం. |
| | 10 | శు | అ. 55-49 జ్యే. 53-16 ది. 6-50 దూర్వాష్టమీ జ్యేష్ఠాదేవిపూజా. |
| | 11 | శ | న. 56-3 మూ. 53-18 రా. 20-37 ఆనందనందన నవమి. |
| | 12 | ఆ | ద 57-49 పూషా. 58-26 ది. 20-39 క్షీరవ్రతారంభః గజలక్ష్మీవ్రతం. |
| | 13 | సో | ఏ. 60-0 ఉషా. 60-0 ది. 20-2. |
| | 14 | మం | ఏ. 0-46 ఉషా. 3-7 ది. 14-2 సర్వేషాం పరివర్తనైకాదశి వామన జయంతి. |
| | 15 | బు | ద్వా. 4-47 శ్ర. 8-32 ది. 19-27 కల్కిద్వాదశి. |

Printed and Published by Dr. S. Seshagiri Rao, at the Lodhra Press, Kesari Kuteeram Ltd
15, Westcott Road, Royapettah, Madras  Editor Dr K. N. Kesari.